# రక్తాక్షరాలు

● నాజీ పరిపాలనలో, నాజీ కారాగృహాల్లో, నాజీ హింసా గృహాల్లో ఫాసిజానికి వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడిన జెక్ కమ్యూనిస్టు మహాయోధుని మహత్తర చరిత్ర.

● అమెరికా కమ్యూనిస్టుపార్టీ నాయకుడు విలియమ్ ఫాస్టర్ ఈ పుస్తకాన్ని గురించి ఇలా అన్నాడు. "కామ్రేడ్ ఫ్యూజిక్ యొక్క జీవితమూ, మరణమూ 'కమ్యూనిస్టు' అనే పదానికే గొప్పపేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టాయి."

● 'న్యూటైమ్సు' పత్రిక (మాస్కో) ఇలా వ్రాసింది: "సమస్త మానవజాతిలో అత్యంత పురోగామి వర్గానికి చెందిన సిద్ధాంతానికీ, దృక్పథానికీ, వాటి కార్యకలాపాలకూ, భావపరంపరకూ సజీవమైన సాకారమైన మూర్తియే ఈ గ్రంథం. భవిష్యత్తు అంతా ఈ పురోగామి వర్గానిదే."

● 'సాటర్ డే రివ్యూ ఆఫ్ లిటరేచర్' అనే పత్రిక ఇలా వ్రాసింది:– "ఇది యదార్థ గాథ, వాస్తవంగా జరిగిన సంఘటన. హృదయాన్ని కదిలించివేస్తుంది. చక్కని రచన. చక్కని శైలి. మానవజాతి శక్తికి–పురోగమనానికి – ఒక ఉజ్వల ఉదాహరణ."

ఇంతవరకు మీరింకా దీన్ని చదవకపోతే వెంటనే చదవండి. మీ కర్తవ్యాన్ని నిర్వహించండి.

దొరకుచోటు :

లీలాబుక్ డిపో : : విజయవాడ 2



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| సంచిక 14 | 1—5—1949 | వెల : 8 అణాలు |
| --- | --- | --- |




కార్మికదినంగా ప్రపంచమంతటా పేరుమ్రోగిన మేడే వచ్చింది. 67 సంవత్సరాలక్రితం చికాగోలు తమ హక్కులకోసం పెట్టుబడిదారీ తుపాకుల్ని ప్రతిఘటించి కార్మికులు ప్రాణాలర్పించారు. ఆ వీరోచితపోరాటానికి చిహ్నంగా కార్మికవర్గం పూర్తిగా విముక్తయ్యేవరకు ఆ పోరాటం కొనసాగించుతామని ప్రతినబూని పురోగమించటానికి దీక్షాదినంగా ప్రపంచ కార్మికులు నాటినుంచీ మేడే జరుపుతున్నారు.

ఈ నాటికి ప్రపంచకార్మికవర్గం బ్రహ్మాండంగా పురోగమించింది. పీడిత ప్రజాకోటికంతటికి నాయకత్వం వహించి అనతికాలంలో అంతిమ విజయం సాధించబోతుంది. కనుకనే కార్మికవర్గంతోపాటు పీడిత ప్రజలంతా మేడేను తమ విముక్తి పోరాటదినంగా పరిగణిస్తున్నారు.

మేడే సోవియట్ ప్రజలకు మహాపర్వదినం. వారు మనిషిని మనిషి దోచుకునే విధానాన్ని తుదముట్టించి సామ్యవాదం నిర్మించుకున్నారు. సర్వ సంపదల్ని శాస్త్రాల్ని తమశాంతి సౌభాగ్యాభివృద్ధికి

వారుపయోగించు కుంటున్నారు. 1940 తో పోల్చితే సోవియట్ పౌరుల ఆదాయం, అనుభవం రెట్టింపుగా పెరిగింది. ఉత్పత్తి శక్తి సాధనలను ఉన్నతస్థాయికి తెచ్చిన సోవియట్ ప్రజలు చేయగలిగినంత పనిచేస్తూ ప్రతిపౌరుడు తన అవుసరమైన సౌఖ్యాలన్నీ అనుభవించగల కమ్యూనిజం వైపు పురోగమిస్తున్నారు. పీడిత ప్రపంచం. మధ్య భూతల స్వర్గం నిర్మించి మార్గదర్శకులైన సోవియట్ ప్రజలు ప్రపంచ విముక్తి పోరాటానికి నేడు నాయకత్వం వహిస్తున్నారు. సోవియట్ ప్రజల స్వర్ణశిఖరంగా దోపిడితనాన్ని దగ్ధంచేసే అఖండజ్యోతిగా, ప్రపంచశాంతికోటగా వెలుగొందుచున్న మాస్కో, కామ్రేడ్సు స్టాలిన్ మోలటావ్‌ల నాయకత్వాన ఈ మేడేనాడు బ్రహ్మాండంగా ప్రదర్శనలు జరుపుతూంటుంది.

పెట్టుబడిదారీ విధాన దోపిడీ శృంఖలాలు బ్రద్దలుగొట్టి బయట పడిన నూతన ప్రజాస్వామిక పోలెండు, జకోస్లేవేకియా, హంగేరి, రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా, తూర్పు జర్మనీ, ఉత్తరకొరియా, మంగోలియాలు, కార్మికవర్గ నాయకత్వాన కష్టజీవుల కల్పతరువు—సోషలిజంను నిర్మించుకుంటున్నాయి. దాదాపు యీ దేశాలన్నింటా కార్మికవర్గపార్టీలన్నీఏకమై మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాన్ననుసరించుచున్నాయి. కార్మిక వర్గానికి నాయకత్వంవహించి నడుపుతున్నాయి. సోవియట్ అడుగుజాడల్లో సుస్థిర శాంతికోసం పురోగమిస్తున్న నూతన ప్రజాస్వామిక దేశాల పదిహేనుకోట్ల కష్టజీవులు యీ మేడేను మహా పర్వదినోత్సవంగా జరుపుకుంటారు.

తూర్పు ఏసియాలో చైనా, ఇండోచైనా, మలయా, బర్మా, ఇండోనేషియా, ప్రజా విముక్తిసైన్యాలు విదేశ స్వదేశ ప్రజావ్యతిరేక సైన్యాలను పారద్రోలి విజయ పరంపరలు పొందుతున్నాయి. చైనా విప్లవ విజయ యాత్రను ముగింపుకు తెస్తున్న వీరోచిత విముక్తిసైన్యానికి బహుశా మేడే నాటికి విప్లవ చరిత్రకు ఆనవేసిన షాంఘై పట్టణ కార్మికులు జే జేలు కొట్టి అక్కడ *కలకాలం తిష్ఠవేసిన విదేశ సామ్రాజ్యవాదుల గుండె లదిరేట్లు స్వాగతమిస్తూంటారు. ఈ మేడే నాటికి మరో ఏభై అరవై కోట్ల ప్రజానీకం సామ్రాజ్యవాదానికి

శాశ్వతంగా సమాధిచేసి సుస్థిరశాంతి స్వాతంత్ర్యాలకు పురోగమిస్తున్నారు.

మిగతా ప్రపంచంలో సామ్యవాదం యింకా పరిపాలిస్తోంది. కాని అంతర్గత వైరుధ్యాలతో అది నానాట క్షీణిస్తోంది. పెట్టుబడిదారీ ప్రపంచంలో అయిదంట మూడువంతులు ఉత్పత్తిచేసే అమెరికా సామ్రాజ్యవాదం ఆర్థికసంక్షోభంలో ఉత్పత్తి సాధనాలు మూలబెట్టి కార్మికుల్ని నిరుద్యోగానికి గురిచేస్తోంది. ఈసంక్షోభం తప్పించుకునేందుకు ప్రపంచం నలుమూలలకు తన కుబేరులవద్ద మూలుగుతున్న ధనాన్ని, గోదాములలో ములిగే వస్తువుల్ని పంపి మార్షలు ప్లాను నెపంతో మార్కెట్లువశం చేసుకుంది. బ్రిటనువంటి సామ్రాజ్యవాద దేశంతో సహా పెట్టుబడిదారీ దేశాల పరిపాలకులంతా తమ దేశాల పారిశ్రామికోత్పత్తిని మూలబెట్టి అమెరికన్ కోటీశ్వరులకు దాసోహం అంటున్నారు. తమ దివాళాకోరు పెట్టుబడిదారీ విధానంతో ప్రజల ఏఆర్థికసమస్యను పరిష్కరించలేక అమెరికన్ అప్పుకోసం అర్థిస్తున్నారు. తమ దేశాల్లో రగులుతున్న ప్రజావిప్లవశక్తుల్ని అణచలేక అమెరికన్ ఆయుధ సహాయానికి అర్రులు చాస్తున్నారు. అందుకు అమెరికా కోరినట్లు దేశస్వాతంత్ర్యాన్ని తాకట్టుపెడుతున్నారు. వారి అవసాన కాలపు చర్యలన్నీ ప్రజల కొనుగోలుశక్తిని మరింత దెబ్బగొడుతున్నాయి. ఉత్పత్తి సాధనాలు మూలబడి ఉత్పత్తి అయిన సరుకు మిగిలిపోయే ప్రమాదం ముంచుకొస్తోంది. ఈ ప్రమాదంనుండి బయటబడి యింకా లాభాలు గుంజేందుకు అమెరికన్ కుబేరులు యుద్ధం ప్రేరేపించి ఆయుధ ఉత్పత్తి అమ్మకాలతో బ్రతకజూస్తున్నారు. యుద్ధంపేరిట దేశదేశాల గుత్తవ్యాపారులు యుద్ధబడ్జెట్టుతో ప్రజలపై పన్నులు రుద్ది అమెరికన్ కోటీశ్వరుల దళారులుగా దేశప్రజల పీడకులుగా బ్రతకజూస్తున్నారు. శాంతియుతంగా పురోగమిస్తున్న సోవియటు యూనియన్‌పైన నూతన ప్రజాస్వామికరాజ్యాలపైన కత్తిగట్టి యుద్ధం రేపెట్టి తద్వారా తమ దేశాల ప్రజావిప్లవశక్తుల్ని అణచి అజేయంగా సాగిపోతున్న ప్రపంచ పీడితప్రజల విముక్తిపోరాట పురోగమనాన్ని అడ్డుకోగలమని యీ అభివృద్ధినిరోధకులు పగటికలలు

కంటున్నారు. అందుకు అవుసరమైన అట్లాంటిక్ బ్లాక్‌ను ఏర్పరచారు. పసిఫిక్ మెడిటరేనియమ్ బ్లాకులను కామన్‌వెల్తుకూటమికి పథకం వేస్తున్నారు.

ఈ వినాశకర యుద్ధోన్మాద పథకాలన్నీ పటాపంచలు చేస్తామని మేడేన పెట్టుబడిదారీ ప్రపంచంలోని కార్మికవర్గశక్తులు ఎలుగెత్తి చాటుతాయి. ఆకలి, అనారోగ్యం అస్వాతంత్ర్యంలను పరిమార్చి శాంతి సౌఖ్యాల నిలయమైన ప్రజాస్వామికంకోసం పోరాడ వారంతా ప్రతిన బూనతారు. ఫ్రాన్సు, ఇటలీల వీరోచిత కార్మికశక్తులు, ఇంగ్లాండు అమెరికాలలోని అభివృద్ధికాముక ప్రజలు గ్రీసు విముక్తగెరిల్లాసైన్యం సామ్రాజ్యవాదులప్లానులు ప్రతిఘటించుతూ మేడే ప్రదర్శనముచేస్తారు.

భారత కార్మికవర్గం ప్రపంచ ప్రజాశక్తులతోపాటే నిలుస్తుంది. భారతస్వాతంత్ర్యాన్ని (కామన్‌వెల్తు కట్టడంలో ప్రవేశించడంతో) బ్రిటిషు సామ్రాజ్యవాదుల ఛత్రచ్ఛాయల్లో అనే సవరణ చేర్చుకోవలసి వచ్చింది, ఆర్థిక స్వాతంత్ర్యం అంటే విదేశపెట్టుబడుల ఆర్థిక దోపిడీకి ఆహ్వానంగా ప్రధానినెహ్రూ ప్రకటన అర్థంచెబుతోంది. ప్రజా స్వామికము అంటె ప్రజల పౌరసత్వహక్కుల్ని హరించి కార్మికుల సమ్మె హక్కులను అరికట్టి సైనిక పరిపాలన సాగించటం అని కాంగ్రెసు ప్రభుత్వాలు వ్యాఖ్యానిస్తున్నాయి. కనీస జీవనభృతి విషయం తలపెట్టకుండా, దున్నుకునేందుకు భూమి మాటెత్తకుండా నడుం నాయ కట్టుకొని పనిచేయటమే ప్రజల బాధ్యతని రామరాజ్య ప్రబోధాలు విన వస్తున్నాయి. జాతుల స్వయంనిర్ణయహక్కు లేదు సరికదా భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనగూడా మన పాలకులకు గిట్టుబాటుగాకుండా పోయింది. దిక్కులు పిక్కటిల్ల వినబడుతున్న నెహ్రూప్రధాని తటస్థ విధానానికి అర్థం ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆర్థిక రాజకీయ పెత్తనానికి లోబడి, ఆసియాలో సామ్రాజ్యవాద వ్యతిరేక సైన్యాలపై కత్తిగట్టటానికి సిద్ధపడిన ఆచరణ అని విదితమవుతోంది. పదజాలపు ముసుగు తొలిగించితే నేడున్న కాంగ్రెసు పరిపాలన ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులతో చేతులు కలిపిన గుత్తవ్యాపారుల ప్రభుత్వమని నగ్నంగా కనపడుతోంది. ఇందువల్ల పీడిత ప్రజల ఏ జీవితసమస్య పరి

ప్కారం కాకపోగా మరింత విషాదంగా పరిణమిస్తోందని పరిస్థితులు చాటిచెప్పుతున్నాయి. ప్రపంచ కష్టజీవులందరితో పాటు యీ మేడేనాడు భారత కష్టజీవులు ఏకమై శాశ్వతశాంతి, కార్మిక కర్షక ప్రజాస్వామికం స్థాపించుకుంటామని ప్రతిన బూనుతారు.

ప్రపంచం రెండు శిబిరాలుగా స్పష్టంగా కనబడుతోంది. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామిక శిబిరం సోవియట్ యూనియన్ నాయకత్వాన యీ మేడే నాటికి దరిదాపు సగం ప్రపంచానికి విముక్తి చేకూర్చింది. మిగతా సగం భాగాన్ని విముక్తి చేయ పురోగమిస్తున్నది. ఇప్పటికీ సగంభాగంలోకి నెట్టబడిన పెట్టుబడిదారీ విధానం ఎన్ని అబద్ధాలు అల్లినా ఎంత విషప్రచారం చేసినా ప్రజాశక్తుల ముందు సోషలిస్టు విధానం ముందు ఓటమి తిని క్షీణిస్తోందనే విషయం జగద్విదితం.

సోషలిజానికి మించిన విముక్తి మార్గం లేదని గ్రహించిన కార్మికుల్ని మోసగించేందుకు సోషలిస్టు పదం తగిలించుకున్నట్లే కొందరు కార్మిక విద్రోహులు మేడే ప్రదర్శనల్లో పాల్గొంటూ కార్మిక వర్గ విచ్ఛిన్నానికి పనిచేస్తున్నారు. సోవియట్ మార్గం నియంతృత్వమని నిందిస్తూ తమది సామ్రాజ్యవాదానికి సోవియట్ సామ్యవాదానికి మధ్య మార్గమని అది 'ప్రజాస్వామిక సోషలిజం'అని చెపుతున్నారు. కాని వీరు సామ్రాజ్యవాద బంట్లు అని చరిత్ర రుజువుచేస్తోంది. ఈ సోషలిస్టు నామకరణం గల పార్టీలన్నీ బోల్షివిక్కు పార్టీ విప్లవ విజయం చేకూర్చుతున్న తొలి ప్రపంచ యుద్ధకాలంలో ఆయాదేశాల సామ్రాజ్య వాదులకు అండగా నిలిచి కార్మికుల్ని యుద్ధాలకు బలిచేశారు. ద్వితీయ ప్రపంచయుద్ధానికి ముందు శాంతి ప్రయత్నాలన్నీ భగ్నంచేశారు. యుద్ధంలో అటు సామ్రాజ్యవాదుల ప్రజావ్యతిరేక చర్యలకో యిటు ఫేసిస్టు విధ్వంసకారులకో దోహదమిచ్చారు. యుద్ధానంతరం మళ్ళీ అమెరికన్ సామ్రాజ్యవాదులకు తాళంవేస్తున్నారు. బ్రిటిషు లేబరుపార్టీ ప్రభుత్వం లోకి వచ్చి సోషలిజం స్థాపించడంలేదు. సామ్రాజ్యవాదులకు దళారిగా మాత్రం పనిచేస్తోందని బ్రిటిషు కార్మికుల జీతావుసరాల కోత లేచాటి

చెబున్నాయి. ఫ్రెంచి, సోషలిస్టుపార్టీ గనుల కార్మికులపై యుద్ధం ప్రకటించటం అమెరికన్ సామ్రాజ్యవాదులకు, డిగాలీకి మించిన బంట్లుగా తాము పనిచేస్తామని హామీలివ్వటం జరుగుతోంది. ఈ 'ప్రజాస్వామిక సోషలిజం' బూటకమని, వీరవలంబించే మధ్య మార్గం సామ్రాజ్యవాదుల యుద్ధ శిబిరంలో చేరటమేనని అట్లాంటిక్ ఒడంబడిక చాటి చెప్పుతోంది. అమెరికన్ కోటీశ్వరుల అడుగులకు మడుగులొత్తే లేబరు ఫెడరేషన్ సి. ఐ. వోల నాయకత్వంతోపాటే పశ్చిమ యూరపు సోషలిస్టు నాయకులు ప్రపంచ కార్మికుల ఏకైక సంస్థ వరల్డు ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌ను విచ్ఛిన్నంచేయ ప్రయత్నించుతున్నారు. అదే మధ్యవర్తిత్వాన్ని, ప్రజాస్వామిక సోషలిజాన్ని మన దేశంలో ప్రచారంచేసే సోషలిస్టుపార్టీ నాయకత్వం యీ జాతికి చెందినదేనని ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును చీల్చటానికి ప్రయత్నించిన వారి దుశ్చర్య, రైల్వే సమ్మె పోరాటాన్ని వెన్నుపోటు పొడిచి పెట్టుబడిదారీ ప్రభుత్వానికి సలాంగొట్టిన వారి విద్రోహము విదితం చేస్తున్నాయి.

కార్మికవర్గ విముక్తి సిద్ధాంతమైన మార్క్సిజం - లెనినిజం ననుసరించే విప్లవపార్టీ నాయకత్వాన ఏకమై పోరాడటమొక్కటే విముక్తిమార్గమని భారత కార్మికులకు మేడే సమీక్షపాఠం చెబుతోంది.

ఐక్యంగా కార్మికవర్గ నాయకత్వాన ప్రజాతంత్ర సంఘటనను నిర్మించుకొని కార్మిక కర్షక ప్రజాస్వామికరాజ్యాన్ని స్థాపించుకోవటం ఒక్కటే శాంతి సౌఖ్యాలకు మార్గమని భారత పీడితప్రజలందరికీ చరిత్ర చెబుతోంది.

విశ్వమానవ సమాజంలో సగభాగానికి సంకెళ్ళు వదలించి పురోగమిస్తున్న సోవియటు యూనియన్, నూతన ప్రజాస్వామిక దేశాలు, ఆశియా విముక్తసైన్యాలు వున్న శిబిరంలో చేరటం ఒక్కటే భారత ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యానికి సుస్థిరశాంతికి సామ్యవాద సాధనమే ఖాయమైన బాట అని జనత విశ్వసిస్తోంది.

# ప్రపంచశాంతి మహాసభ

ఈ నెల 20వ తేదీన ప్యారిస్ నగరంలో జరుగబోతున్న ప్రపంచ శాంతి కాముకుల మహాసభ అత్యంత ప్రాముఖ్యంగల ఒక చారిత్రాత్మక సంఘటన.

ఈ మహాసభ అంతర్జాతీయ మేధావుల కళాకారుల సమావేశ కమిటీ యొక్క — అంతర్జాతీయ ప్రజాతంత్ర మహిళా ఫెడరేషన్ల యొక్క — సంయుక్త పిలుపుపై జరుగుతోంది. ఈ మహాసభకు ప్రపంచమంతటావున్న శాంతికాముక ప్రజానీకం తన ప్రతినిధులను పంపుతోంది.

తమ విముక్తి కోసం పోరాడుతున్న పీడిత మానవజాతికి అగ్రగామిగా వుంటున్న సోషలిస్టు భూమిలోని ప్రజలకూ, సామ్రాజ్యవాదుల బానిసత్వాన్నుండి ఇంతకుముందే విముక్తిపొంది. సోషలిస్టు సమాజంలో ప్రవేశిస్తోన్న యూరప్‌లోని ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల ప్రజలకూ, ఆసియాఖండ విముక్తికి ఆశాజ్యోతిగా వెలుగొందుతూ విజయ పరంపరలను పొందుతున్న విప్లవ చైనాకూ, పెట్టుబడిదారీ ప్రపంచంలోనలుమూలలా నున్న శ్రామికప్రజానీకానికీ సోషలిజంకోసం, ప్రజాస్వామికంకోసం పోరాడుతున్న కార్మికులకు, కర్షకులకు, మహిళలకు, యువకులకు, కళాకారులకు, రచయితలకు, మేధావులకూ, తమ కష్టఫలితంగా తమ భుక్తిని సంపాదించుకోనే ప్రతి వ్యక్తికీ యుద్ధాన్ని కోరనివారందరికీ — యీ మహాసభలో ప్రాతినిధ్యం ఉంటుంది.

40 కోట్ల ప్రజలకు ప్రాతినిధ్యం వహించుతున్న సంస్థలు యీ మహాసభలో పాల్గొంటున్నాయి.

ప్రపంచ చరిత్రలోని ఒక అపూర్వసమయంలో యీ మహాసభ జరుగుతూ ఉంది. రెండో ప్రపంచ యుద్ధసమయంలో భర్తలు పోయిన భార్యల, కన్నబిడ్డలుపోయిన తల్లుల, తల్లిదండ్రులను పోగొట్టు

కొన్న అనాథబిడ్డల కండ్లనీటితడి యింకనూ ఆరనేలేదు. అప్పుడే ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు మరొక భయంకరయుద్ధానికి యింతకుముందు జరిగినదానికంటే దారుణమైన మరో మారణహోమానికి-ప్రపంచాన్ని ఆహుతి చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు.

విజయ పరంపరలతో అజేయంగా ముందుకు పురోగమిస్తున్న సోషలిస్టుశక్తులకూ, పెట్టుబడిదారీ దేశాలలోనూ, వలసదేశాలలోనూ మహోధృతంగా ప్రజ్వరిల్లుతున్న విప్లవ శక్తులకూ, పెట్టుబడిదారీ ప్రపంచ మూలపునాదినే కదిలించి వైచే (త్వరలో రానున్న) ఆర్థికసంక్షోభానికీ - విపరీతంగా భయకంపితులైన సామ్రాజ్యవాదులూ, పెట్టుబడిదారులూ వాల్‌స్ట్రీట్ డాలర్ గుత్త పెట్టుబడిదారుల నాయకత్వాన ఏకమై తమ లాలభానూ, తమ ఆధిపత్యాన్నీ యుద్ధంద్వారా కాపాడుకొనేందుకు తెగించి ఆఖరి ప్రయత్నం చేస్తున్నారు.

సామ్రాజ్య వాద దురాక్రమణ దారులు యిటీవలనే చేసుకొన్న అట్లాంటిక్ ఒడింబడిక అంతరార్థం యిదే. ఈ ఒడంబడికనే వలస ప్రపంచంలో సామ్రాజ్యవాదులతో చేతులుకలిపిన బూర్జువా వర్గాలన్నీ బానిస బుద్ధితో బలపరచాయి.

అట్లాంటిక్ ఒడంబడిక సోవియట్ యూనియన్‌ను నాశనం చేయడానికి ఉద్దేశించబడింది. ఎందువల్లనంటే సామ్రాజ్యవాద దురాక్రమణ దారులు ప్రపంచాధిపత్యానికి పన్నుతున్న ప్లానులకు సోషలిస్టు భూమి తమకు అధిగమించలేని అడ్డుకట్టగా తయారయిందని వారు తెలుసుకొన్నారు. అంతేకాదు: సోవియట్ యూనియన్ ప్రపంచమంతటా సోషలిజం విజయాన్ని గ్యారంటీ చేస్తున్నదని కూడా సామ్రాజ్యవాదులు గ్రహించారు.

కాని ప్రతిదేశంలోని కార్మికవర్గమూ, సామాన్యప్రజానీకమూ-వారికి కాపాడుకొనేందుకు ఎలాంటి ప్రత్యేక లాభాలుగానీ, ఆధిక్యతగానీ లేవు. భుక్తికోసం తమ కష్టార్జితంపైనే ఆధారపడే ఏ మానవుడూ యుద్ధాన్ని కోరడంలేదు. యుద్ధాలకు దారితీసే సామ్రాజ్యవాదుల పాలసీఅంటే ఏమిటో వారికి తెలుసు. సామ్రాజ్యవాదుల

పాలసీఅంటే, విపరీతంగా తమజీవన ప్రమాణాన్ని తగ్గించడం, కార్మిక వర్గ ఉద్యమాలనూ, అన్నిరకాలైన ప్రజాతంత్ర ఉద్యమాలనూ వలస దేశాల ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాలనూ అంతులేని నిర్బంధ విధానంతో అణచివేయడమనీ వారికి తెలుసు.

తమ ప్రయోజనాలకు సామ్రాజ్యవాదులవల్ల పెట్టుబడిదారుల వల్లనే ఆటంకం వున్నదనీ సోషలిస్టు భూమివల్ల లేదనీ ప్రతిదేశం లోని కార్మికవర్గానికీ సామాన్య ప్రజానీకానికీ ఈ విషయం తెలుసు. శాంతికోసం ప్రజాస్వామికం కోసం సోషలిజం కోసం జరిగే ప్రపంచ ప్రజల పోరాటంలో అగ్రగామిగానూ, తమకు మిత్రుడుగానూ, సహచరుడుగానూ సోవియట్ యూనియన్ వుండితీరుతుందనే విషయంకూడా శ్రామిక ప్రజకు తెలుసు.

ఈ నాడున్న పరిస్థితులలో శాంతికోసం ప్రజాస్వామికం కోసం సోషలిజం కోసం పోరాడే శక్తుల బలం సామ్రాజ్యవాద యుద్ధ ప్రేరేపక శక్తుల బలంకంటే అత్యధికంగా ఉంది. శాంతి కాముకశక్తులు చొరవతో ముందుకొచ్చి ఐక్యమై గట్టిగా ఖచ్చితంగా ఎదురు దెబ్బతీసిన పక్షంలో సామ్రాజ్యవాద దురాక్రమణ దారులను సకాలంలో వెనక్కు తరుమగలిగి యుద్ధాన్ని ఆపగలిగే స్థితిలో వున్నాయి.

శాంతి, ప్రజాస్వామిక, సోషలిస్టు శక్తుల అత్యధిక బలాన్ని యీ క్రింద ఉదహరించే యధార్థాలను బట్టి ఇంకా స్పష్టంగా తెలుసుకోవచ్చు గత యుద్ధాన్నుంచి యిదివరకెన్నడూ లేనంత ఆంతరంగిక బలంతోనూ, అంతర్జాతీయ ప్రతిష్ఠతోనూ సోవియట్ యూనియన్ బయటపడి సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని జయప్రదంగా ముగించుకొని అజేయమైన కమ్యూనిజం వైపుకు అచంచల విశ్వాసంతో ముందుకు సాగిపోతూఉంది.

— తూర్పు యూరప్‌లోవున్న ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు సామ్రాజ్యవాదులబంట్లనూ, విచ్ఛిన్నకారులనూ పూర్తిగా పరిమార్చి, సంయుక్త కార్మికవర్గపార్టీల నాయకత్వాన సోషలిస్టు సమాజ నిర్మాణానికి పురోగమించుతున్నాయి.

— జయప్రదంగా పురోగమించుతున్న చైనా ప్రజాసైన్యం బర్మా, మలయా, ఇండోనేషియా, వియత్‌నాం దేశాల్లో ప్రజ్వరిల్లు తున్న ప్రజల విప్లవాత్మక ఉద్యమాలూ ఆసియాలో సామ్రాజ్య వాదానికీ, పెట్టుబడిదారీ విధానానికీ చావుదెబ్బలు కొడుతున్నాయి.

— పశ్చిమ యూరోప్‌లో కార్మికవర్గ ఉద్యమాలు పూర్తిగా బలపడి, పరిపక్వదశను పొందిన ఫలితం ఫ్రాంసు, ఇటలీ కమ్యూనిస్టు పార్టీల విజృంభణలో సంపూర్తిగా ద్యోతకమవుతోంది.

— ఏడుకోట్ల సభ్యత్వంగల ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్‌లో అంతర్జాతీయ కార్మికోద్యమం ఐక్యమై సోషల్ డెమాక్రేట్ల విచ్ఛిన్నకర ప్రయత్నాలను సహితం అధిగమించి మరింత బలంతో ముందుకుపురోగమించుతోంది. ఈ శక్తులన్నీ నేడు అట్లాంటిక్ ఒడంబడికకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన సమ్మెలద్వారా, ప్రదర్శనాల ద్వారా ప్రపంచమంతటా కార్యరంగంలోకి దుముకుతున్నాయి. శాంతి కొరకు ప్రపంచ ప్రజల ఉద్యమం యీ విధంగా దినదినాభివృద్ధి చెంది, విపరీతంగా బలపడుతోంది.

ఈ విధంగా ఖచ్చితంగాఉన్న బలమే శాంతికాముక శక్తులు సామ్రాజ్యవాదుల అట్లాంటిక్ ఒడంబడిక సవాలును అందుకొని సోవియట్ ప్రజల నాయకత్వాన ప్యారిస్‌లో ప్రపంచ మహాసభకు తమ శక్తుల నన్నింటినీ సమీకరించేటట్లు చేయగలిగింది.

ప్రపంచశాంతి మహాసభ లోకశాంతికి జరిగే మహా సంగ్రామంలో ఒక నూతనఘట్టాన్ని ప్రారంభిస్తుంది. ఈ మహాసభయిచ్చే ఉత్సాహంతో ప్రతి దేశంలోని శాంతికాముక ప్రజలంతా తమతమ దేశాలలో అత్యధిక సంఖ్యాకులైన కార్మికవర్గ నాయకత్వాన జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ తమ శక్తులను ఐక్యపరచి, తమ దేశాలలోని యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా బలమైన ఎదురుదెబ్బను తీయడానికి దృఢంగా ధైర్యముగా నిలబడగలుగుతారు.

ప్రపంచ శాంతికోసం జరిగే యీ పోరాటంలో భారత కార్మిక వర్గమూ, భారతశ్రామిక ప్రజాకోటీ, మనదేశంలోని ప్రజాతంత్ర

వాదులూ, శాంతి కాముకులూ - అంతా అత్యంత ముఖ్యమైన ఈ బాధ్యతను నిర్వహించవలసి ఉంటుంది.

# నెహ్రూ- పటేల్ ప్రభుత్వం

భూగోళరీత్యా ఇండియాకున్న కీలక స్థానాన్ని, దాని అపార మనుష్య సంపత్తినీ ఇతరసంపత్తినీ దృష్టిలోవుంచుకొని ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇండియాను ఆసియాలో తమ ఆర్థిక- మిలిటరీ కేంద్రంగా తయారుచేసుకోవాలని ఉద్దేశించి, అందుకోసం తమ యావచ్ఛక్తినీ కేంద్రీకరించి పనిచేస్తున్నారు. ఈ విధంగా ఇండియానుండి ఆసియాలోని విప్లవోద్యమాలను దెబ్బకొట్టదలచారు. అంతేకాదు; సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా తాముజరుపనున్న యుద్ధానికి ఇండియాను కేంద్రంగా వినియోగించాలని కుట్రపన్నుతున్నారు. తమదురాక్రమణ మారణహోమంలో మనకార్మికవర్గాన్ని సమిధగా వినియోగించడానికి పన్నాగాలను పన్నుతున్నారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన చైనా ప్రజల విముక్తి సేనలు సాధిస్తున్న మహత్తరవిజయాలకూ, బర్మా, మలయా, ఇండోనీషియా, వియత్‌నాం దేశాల్లో ప్రజ్వరిల్లుతున్న బ్రహ్మాండమైన సాయుధ పోరాటాలకూ భారత పెట్టుబడిదారుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే నెహ్రూ - పటేల్ ప్రభుత్వం కంగారుపడి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల వెనుక జేరుతోంది.

నెహ్రూ - పటేల్ ప్రభుత్వం ఇండియాను వలస దేశంగానూ, సోవియట్ వ్యతిరేక యుద్ధ కేంద్రంగానూ, వాల్ స్ట్రీటు ధనికవర్గాలకు అమ్మివేస్తోంది. అమెరికా గుత్త పెట్టుబడిదారుల నాయకత్వాన యుద్ధ కూటమిలోనూ, పెట్టుబడిదారీ వలస బానిసత్వపు కూటమిలోకి చేరిపోతోంది.

అయితే నెహ్రూ ప్రభుత్వం భారతదేశంలోని అశేష శ్రామిక ప్రజాకోటికి ప్రాతినిధ్యం వహించదు. కొద్దిపాటి మైనారిటీ అయిన పెట్టుబడిదారీ, జమీందారీ దోపిడీవర్గాలకు మాత్రమే ప్రాతినిధ్యం

వహిస్తుంది. అందుకనే తానిప్పుడు అనుసరించే పాలసీనే యింకా బాహాటంగా అనుసరిస్తే మనదేశంలోని సామాన్య ప్రజలనుండి తీవ్రమైన ప్రతిఘటన వస్తుందనే విషయం నెహ్రూ ప్రభుత్వానికి స్పష్టంగా తెలుసు.

ఎవరో కొద్దిమంది జమీందార్లూ, పెట్టుబడిదారులూ తప్ప భారతదేశంలోని కార్మికవర్గమూ, అత్యధిక సంఖ్యాకమైన ప్రజానీకమంతా శాంతినీ, స్వాతంత్ర్యాన్నీ, సోషలిజాన్ని గాఢంగా వాంఛించుతోంది! సామ్రాజ్యవాదాన్నీ, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకింద దుర్భర బానిసత్వాన్నీ మన ప్రజలు సహించరు. మరో యుద్ధం వచ్చే పక్షంలో ఇండియాయే ప్రధాన యుద్ధరంగం అవుతుందనీ, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులయొక్క - వారి బంట్లు అయిన టాటా, బిర్లాలయొక్క - లాభాలకోసం తామే ముందు బలికావలసివస్తుందనే విషయం భారత సామాన్య ప్రజానీకానికి తెలుసు.

ప్రపంచసోషలిజానికీ, ఆసియాలోని వలసప్రజల స్వాతంత్ర్యానికి దివ్యజ్యోతిగా వెలుగొందిన సోవియట్ నవంబరు మహా విప్లవంతో భారత కార్మికవర్గానికీ, భారత శ్రామిక ప్రజాకోటికీ, మన దేశంలోని ప్రజాతంత్ర వాదులందరికీ ముఖ్యంగా సన్నిహిత సంబంధాలు ఉన్నాయి.

పెట్టుబడిదారీ దోపిడీ విధానంతో చిరకాలం అణచబడిన భారత శ్రామిక ప్రజాకోటి సోషలిజంలోనే తన విముక్తి యిమిడివున్నదని గ్రహించగలిగింది. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో మన పొరుగుదేశమైన సోవియట్ యూనియన్‌ను ప్రధాన దుర్గంగా భారత శ్రామిక ప్రజాకోటి గుర్తించగలిగింది. 1920 ఆ ప్రాంతాలలో - ఆనాడు అత్యధికబల సంపత్తిగలిగిన సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ శక్తులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రారంభదశలో తమకు సోవియట్ సోదరులు చేసిన అపారమైన సహాయాన్ని భారత కార్మికవర్గం ఎన్నటికీ మరచిపోలేదు.

అందుకనే మన దేశంలోని శ్రామిక ప్రజానీకమూ, ప్రజాతంత్ర శక్తులూ - అందరూ సోవియట్ యూనియన్ నాయకత్వాన

వున్న ప్రపంచ శాంతికాముకశక్తుల పక్షాన్నే ఖచ్చితంగా చేరుతారు. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద దురాక్రమణ కూటమిలో ఇండియాను చేర్చివైచే నెహ్రూ ప్రభుత్వపు ప్రతి ప్రయత్నాన్నీ తీవ్రంగా ప్రతిఘటించి తీరుతారు. జాతీయ స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, సోషలిజానికీ పురోగమించడానికి వారికదొక్కటే పంథా.

భారతకార్మికవర్గం తనకు ప్రాతినిధ్యం వహించే కేంద్ర సంస్థ అయిన అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు నాయకత్వాన సోదర ప్రజాసంస్థలన్నింటినీ మనదేశంలో ప్రజాస్వామిక శాంతికాముకశక్తులన్నింటినీ సంఘటితపరచి సోవియట్ యూనియన్‌కు అనుకూలంగానూ, యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగానూ దేశవ్యాపితంగా శక్తివంతమైన సంయుక్త ప్రజా ఉద్యమాన్ని నిర్మించడానికి అప్పుడే చొరవ తీసుకొని పనిచేయ ప్రారంభించింది.

భారతపోరాట ప్రజలకూ, దేశంలోని ప్రజాతంత్ర శక్తులకూ నిజమైన ప్రాతినిధ్యం వహించగలిగే ప్రతినిధివర్గం నెహ్రూ - పటేల్ ప్రభుత్వం అవలంబించే ఫాసిస్టు నిర్బంధ విధానపుణ్యమా అంటూ ప్రపంచ శాంతి మహాసభకు హాజరుకాలేక పోతున్నది. అయినప్పటికి తాము సోవియట్ నాయకత్వాన శాంతి స్వాతంత్ర్య సోషలిజంల కోసం ప్రపంచ ప్రజల కూటమిలోనే తమ స్థానాన్ని ఖచ్చితంగా స్వీకరిస్తామనే తమవాగ్దానాన్ని మహాసభకు అందజేస్తారు. మహాసభ చర్చల ఫలితంగా యుద్ధోన్మాదులకూ, అన్ని దేశాలలోని వారి ఉపగ్రహాలకూ వ్యతిరేకంగా నిర్మించబోయే అజేయప్రపంచ పోరాట సంఘటనలోనే తాము స్థిరంగా నిలబడి వుంటామనే తమ దృఢప్రతిజ్ఞను తెలియజేస్తారు.



# ప్రపంచ కార్మికులారా! ☆ ఏకంకండి!

## ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ 'మే డే' విజ్ఞప్తి

**ప్రపంచ కార్మిక స్త్రీ పురుషులారా!**

కుల, మత, జాతి, రాజకీయ వివక్షత లేకుండా యావత్ ప్రపంచకార్మికవర్గంలో అత్యధిక సంఖ్యాకులను సంఘటితపరచిన ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ప్రపంచ కార్మికులందరకూ గొప్పపండుగ దినమయిన మేడే సందర్భంలో మీ అందరకు హృదయపూర్వకమైన అభివందనాలందజేస్తోంది.

మీ బలాన్నీ, మీ అభీష్టాన్నీ, మీ ఆశలనూ, మీ ఆశయాలనూ, విజయంలో మీకున్న అచంచల విశ్వాసాన్నీ ఆశయ సాధనకోసం జరిపే పోరాటంలో మీరు చూపే వజ్రసంకల్పాన్నీ ఈ మేడేపండుగ నాడు ప్రదర్శించండి! సమస్త ప్రజానీకంలో ఒక నూతనోత్సాహాన్ని కలిగించండి!

నేడు ప్రపంచం అంతటా యుద్ధమేఘచ్ఛాయలు ఆవరిస్తున్నాయి. ఆర్థిక సంక్షోభం రోజురోజుకూ తీవ్రతరం అవుతూంది. గుత్తపెట్టుబడిదారీ విధానం ఫలితంగానే ఈ రెండు మహావిపత్తులను ప్రపంచ ప్రజానీకం ఎదుర్కోవలసి వస్తోంది. ఈ రెండువిపత్తులూ అనేక సాంఘికసంఘర్షణలకు తప్పకదారితీస్తాయి.

## ఆర్థిక సంక్షోభం

రానున్న ఆర్థిక సంక్షోభంయొక్క సూచనలు అప్పుడే కనిపిస్తున్నాయి. కార్మికుల కొనుగోలుశక్తి నానాటికి తగ్గిపోతుంది. కార్మికుల కనీస జీవితావసరాలనుకూడా ఈ ప్రభుత్వం తీర్చలేదు. కార్మికులు కష్టపడి ఎంత ఉత్పత్తి చేసినా అర్ధాకలితో వారు పస్తులు పండుకోవలసి వస్తూనే ఉంది.

దీనికితోడు నోట్లముమ్మరం ఇంకా ముమ్మరంగా పెరిగిపోతూనేఉంది. ధరలు విపరీతంగా పెరుగుతూనే ఉన్నాయి. నిరుద్యోగ సమస్య ఒక బ్రహ్మరాక్షసిగా పరిణమించింది. పెట్టుబడిదారీ విధానం ఉన్నంతకాలం ఈ నిరుద్యోగ సమస్య కూడా ఉండేదే. యుద్ధకాలంలో చేసిన వాగ్దానాలన్నీ బుట్టదాఖలయ్యాయి.

కార్మికులిప్పటినుంచే ప్రతిఘటన సాగించకపోతే చివరకు ఈఆర్థిక సంక్షోభ భారమంతా వారే మోయవలసి వస్తుంది. దారిద్ర్యానికీ, దోపిడికీ మరింత దారుణంగా గురికావలసి వస్తుంది,

గుత్తపెట్టుబడిదారులే మరోప్రపంచ యుద్ధాన్ని ప్రేరేపిస్తున్నారు. యుద్ధ కాలంలో అవలంబించిన పరస్పర సహకార విధానానికి స్వస్తిచెప్పి యుద్ధానికి సన్నద్ధం అవుతున్నారు. నేటి సాంఘిక సంఘర్షణకు ఇదొక ప్రధానకారణం.

## యుద్ధమే మేలు

ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొనే దానికంటె యుద్ధాన్ని ఎదుర్కోవడమే మంచిదనీ, యుద్ధానికంటె ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించడం చాలాఎక్కువ ఖర్చుతో కూడుకున్న పనిగా బట్టి యుద్ధమే మంచిదనీ గుత్తపెట్టుబడిదారీ వర్గప్రతినిధులు బాహాటంగా చాటుతున్నారు.

యుద్ధంఅంటే ఒక భయంకర మారణహోమమే అయినప్పటికీ ప్రజలరక్తాన్ని పీల్చిపిప్పిచేసే జలగలకు -పెట్టుబడిదారులకు- మాత్రం అది చాలా లాభసాటి బేరంగా ఉంటుంది. వాళ్ళ ఇనపపెట్టెలు నిండిపోతాయి. ఆయుధనిర్మాణంలో పోటీబడి ఇప్పటికే వాళ్లు కోటానుకోట్ల లాభాలు గుంజేశారు. స్వాతంత్ర్యరక్షణ ప్రజాస్వామ్య రక్షణ అనే సాకులతో ప్రజల్లో యుద్ధోన్మాదాన్ని విపరీతంగా రెచ్చగొడుతున్నారు. చావులూ, ఆకలి బాధలూ, విధవస్త్రీల హాహాకారాలు, అనాథశిశువుల ఆర్తనాదాలుతప్ప యుద్ధం వల్ల కార్మికులకు ఒరిగేదేమిటి?

నూతన యుద్ధప్రేరేపకులు 'ఆటంబాంబు' నొక సర్వరోగనివారిణిగా భావిస్తున్నారు. యుద్ధనష్టం ఎక్కువగా సంభవించకుండా కొద్దివారాల్లోనే యుద్ధాన్ని సమాప్తి చేయవచ్చుననీ, ఆటంబాంబులు కలిగిఉన్న దేశాలు యుద్ధనష్టానికి ఏమాత్రం గురికావనీ వాళ్లు ప్రచారం చేస్తున్నారు. కాని ఆటంబాంబుల ఫలితంగా ఎగిరిపోయే లక్షలకొలది ప్రాణాలకు వాళ్ళదృష్టిలో వీసమంతైనా విలువలేదు. ప్రజలప్రాణాలంటే వాళ్ళకు గడ్డిపోచతో సమానం.

ఆటంబాంబులతో మెరుపు దాడులు చేసి తేలికగా విజయంసాధించవచ్చునని ఈ యుద్ధోన్మాదులు కలలుగంటున్నారు. ఒకప్పుడు హిట్లరుకూడా ఇదేవిధంగా ఊహించాడు. హిట్లరు చేసినతప్పునే మళ్లీ ఈ కొత్తహిట్లర్లు చేయబోతున్నారు.

ఈ యుద్ధోన్మాదులు బాధ్యతారహితంగా మనపై తెచ్చిపెట్టే యుద్ధం తప్పకుండా ప్రపంచయుద్ధంగా మారి తీరుతుంది. నాగరికతనే నాశనంచేస్తుంది. చివరకు యుద్ధోన్మాదులందరూ ఆయుద్ధంలో పతనంకాక తప్పదు.

అయినప్పటికీ మనశక్తులన్నిటినీ సమీకరించి మనం శాంతిరక్షణకోసం తీవ్రంగా కృషిచేయవలసి ఉంటుంది. కులమత జాతి రాజకీయ విచక్షణలేకుండా శాంతి నభిలషించే ప్రజాస్వామిక శక్తులన్నింటిని యుద్ధానికి వ్యతిరేకంగా సమీకరించి ఒక ప్రపంచ శాంతిసంఘటన నిర్మించవలసి ఉంటుంది. యుద్ధప్రమాదాన్ని అరికట్టడానికి కార్మికులు తమ దృఢనిశ్చయాన్ని ప్రదర్శించి అందుకవసరమైన ఐక్యసంఘటనను నిర్మించడానికి దృఢనిశ్చయంతో కార్మికవర్గం తీవ్రంగా కృషిచేసినట్లయితే మరోయుద్ధాన్ని రాకుండా అరికట్టగలం.

ఇదివరకెన్నడూ లేనంతంగా కార్మికవర్గంలో అభేద్యమైన ఐక్యత ఏర్పడాలి. సంఘటిత కార్మికవర్గశక్తిఅంటే ఏమిటో అభివృద్ధినిరోధకవర్గానికి బాగా తెలుసు. కాబట్టే కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం,

చేయడానికి అభివృద్ధినిరోధకులు తీవ్రంగా ప్రయత్నిస్తారు.

సామ్రాజ్యవాదులకు సాంప్రదాయ సిద్ధమైన 'విభజించి పాలించు' సూత్రాన్ని ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి వ్యతిరేకంగా ఉపయోగిస్తారు.

గుత్తపెట్టుబడిదారీవర్గం వివిధస్వరూపాల్లోనున్న అభివృద్ధి నిరోధకులందరినీ కూడగట్టి కార్మికోద్యమంపై ప్రయోగిస్తుంది. కార్మికోద్యమ విచ్ఛిన్నతకు వాళ్లు తమ సర్వశక్తులూ ధారవోస్తారు.

పెట్టుబడిదారీవర్గానికి అమ్ముడుబోయిన కార్మికద్రోహుల జేబుసంఘాలకు కొన్ని దేశాల్లో ప్రభుత్వసహాయం పూర్తిగా లభిస్తూఉంది. నిజమైన కార్మిక సంఘాలను ఫాసిస్టు పశుబలంతో కొన్ని ప్రభుత్వాలు అణచివేయ పూనుకుంటున్నాయి. బలప్రయోగంతో కార్మికసంఘ ఆఫీసులు మూసివేస్తున్నారు. సంఘాల డబ్బును (ఫండు) స్వాధీనంచేసుకుంటున్నారు. నాయకులను జైళ్ళల్లో బంధిస్తున్నారు. అక్కడక్కడ వారిని హత్య చేయడంకూడా జరుగుతోంది. నిజమైన కార్మిక సంఘాలస్థానే బూటకపు సంఘాలను నెలకొల్పుతున్నారు. ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా పోటీసంఘాన్ని నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్‌ను విచ్ఛిన్నం చేయడానికి విఫలప్రయత్నాలు

ఈ సంవత్సరం జనవరిలో కొందరు బ్రిటిషు ట్రేడుయూనియన్ కాంగ్రెసు నాయకులూ, అమెరికా సి. ఐ. ఓ. (కాంగ్రెసు ఆఫ్ ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్సు) నాయకులూ తమ తమ ప్రభుత్వాల ప్రోత్సాహంపై ప్రపంచ ట్రేడు యూనియన్ ఫెడరేషన్‌ను విచ్ఛిన్నం చేయడానికి తీవ్రంగా ప్రయత్నించారు. ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్‌ను చీల్చడాన్ని కార్మికులంగీకరిస్తారా లేదా? అనే విషయాన్ని అయినా ఈ నాయకమ్మన్యులు కార్మికులతో సంప్రదించలేదు. ఆ విధంగా కార్మికులతో ముందే సంప్రదించేటట్లయితే కార్మికుల నుంచి వ్యతిరేక సమాధానం వస్తుందని వారికి తెలుసు. ఎందువల్లనంటే వివిధ దేశాల్లోని కార్మికవర్గాల్లోగానీ, వారిప్రయోజనాల్లోగానీ ఎటువంటి వైరుధ్యాలూ లేవనే సంగతి జగద్విదితమే. ఇంగ్లాండు, ఫ్రాన్సు, చైనా, రష్యా - మరేదేశంలోని కార్మిక వర్గంలోనూ పరస్పర ద్వేషభావాలుండడానికి ఎట్టి అవకాశంలేదు. ఏ దేశంలో ఉన్నా కార్మికుల ప్రయోజనాలన్నీ ఒకటే. ప్రపంచ కార్మికులందరిదీ ఒకటే ధ్యేయం - ఒకటే ఆశయం. ఇందుకు ప్రపంచకార్మికోద్యమానుభవమే ప్రత్యక్షసాక్షి. ఈ అనుభవాన్నిబట్టే మనం మరొక గుణపాఠంకూడా నేర్చుకోవలసి ఉంటుంది. పెట్టుబడిదారీవర్గం తన దోపిడిని ఇంకా ఎక్కువగా యథేచ్ఛగా కొనసాగించడానికి కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు ప్రయత్నిస్తారు.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ కమ్యూనిస్టుపార్టీ సంస్థ అని కార్మికోద్యమ విచ్ఛిన్నకులు పదేపదే ప్రచారం చేస్తున్నారు. కమ్యూనిస్టు భూతాన్ని చూపి కార్మికులనుభయపెట్టజూస్తున్నారు. వాళ్ళ యజమానులైన సామ్రాజ్యవాదులు

చేస్తూన్నట్లే వాళ్ళుకూడా కార్మికవర్గాన్ని రెండుగా చీల్చాలని ప్రయత్నిస్తున్నారు. కార్మికోద్యమంలో తమకెంతో అనుభవం ఉన్నదనీ, తామే సరియైన పద్ధతులపై ఆ ఉద్యమాన్ని నడపగలమని చెప్పుకుంటు న్నారు.

వారికి కార్మికోద్యమంలో అనుభవం ఉన్నమాట వాస్తవమే. అయితే ఆ అనుభవం కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి మాత్రమే నేడు ఉపయోగిస్తోంది. అసలు ట్రేడ్‌యూనియన్ ఉద్యమం యొక్క ప్రధానాశయం కార్మికవర్గంలో ఐక్యతను సాధించడమే. అందులో కమ్యూనిస్టు, నాన్ కమ్యూనిస్టు అనే సమస్యేలేదు. విభిన్న రాజకీయ భావాలుగల కార్మికులందరికీ ట్రేడ్ యూనియన్లలో ప్రవేశార్హత ఉంది. ట్రేడ్‌యూనియన్ ఒక రాజకీయపార్టీ కాదు.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌ను విచ్ఛిన్నం చేయాలని ప్రయత్నించినవారి ఆశలన్నీ నిరాశలయ్యాయి. కార్మికోద్యమ విచ్ఛిన్నకులు తమ సంఘాల నుంచికూడా వేరుపడిపోవడం జరిగింది. కాని ఫెడరేషన్ మాత్రం దినదినాభివృద్ధి చెందుతూ ముందుకు సాగిపోతూనేఉంది. నిరాఘాటంగా తన కార్యక్రమాన్ని కొనసాగిస్తూనే ఉంది.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఒక్కటే నిజమైన అంతర్జాతీయ కార్మికోద్యమానికి ప్రతినిధిసంస్థ. నిజమైన ప్రజాస్వామిక పద్ధతులపై ఈ సంస్థ పనిచేస్తూఉంది. కార్మికవర్గ శ్రేయోభిలాషులందరికీ - వారి రాజకీయ భావాలేమైనాసరే - ఇందులో స్థానం ఉంది. ఆసియా, లేటిన్ అమెరికా, ఆఫ్రికాలలో వెనుక బడివున్న కార్మికోద్యమాన్ని అభివృద్ధి చేయడానికి ప్రపంచ ఫెడరేషన్ తన సర్వసక్తులా కృషిచేస్తూఉంది. ఐక్యరాజ్యసమితి ద్వారా అన్ని అంతర్జాతీయ సంస్థల్లో కార్మికవర్గ ప్రయోజనాలను కాపాడడంకోసం కార్మికుల పక్షాన తీవ్రంగా పోరాడుతుంది. "సమానమైన పనికి సమానమైన జీతం" అనే సూత్రాన్ని అమలు జరిపించడానికీ, వెట్టిచాకిరిని నిరోధించడానికీ కార్మికులపై జరిగే నిర్బంధ విధానాన్ని అరికట్టడానికీ కార్మికుల జీవన ప్రమాణాన్ని పెంచడానికీ ప్రపంచ ఫెడరేషన్ వీరోచితంగా పోరాడుతూ ఉంది.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ యొక్క ద్వితీయ సమావేశం 1949 జూన్‌లో జరుగుతుంది. కార్మికోద్యమానికి సంబంధించిన కార్యకలాపాలను గురించీ, నేటిరాజకీయ పరిస్థితులనుగురించీ భవిష్యత్ కర్తవ్యాన్ని గురించీ, ఆ సమావేశంలో నిర్ణయించబడుతుంది.

ఆ సమావేశానికి మీరు పంపదలచుకున్న సూచనలను ఇప్పటినుంచే పర్యాలోచించండి. మీ మీ ప్రతిపాదనలను తయారుచేసి పంపండి. ప్రపంచ కార్మిక సమాఖ్య ఆశయాలను బలపరచండి

విచ్ఛిన్నపుకొత్తుగడలను నిర్బంధాలనూ, హత్యలనూ ఎదుర్కొంటూ ప్రపంచ ప్రజాస్వామికశక్తులుశరవేగంతో పురోగమిస్తున్నాయి. కార్మికోద్యమం అభివృద్ధిచెందుతోంది. బలపడుతోంది. అనేకదేశాల్లో నేడు కార్మికవర్గమే అధికారాన్ని చేపట్టింది. తన భవిష్యత్తును తానే యథేచ్ఛగా నిర్ణయించుకుంటూ ఉంది. నూతన జీవితాన్ని నూతన సమాజాన్ని నిర్మిస్తోంది. ఈ దేశాల్లో కార్మికో

ద్యమం మూడుపువ్వులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతోంది. యుద్ధోన్మాదులు వేసే వెర్రికేకలూ, చేసే దుష్ప్రచారమూ వారి పురోగమనాన్ని అరికట్టలేక పోయాయి. స్వాతంత్ర్యంకోసం, స్వయం నిర్ణయాధికారంకోసం వలసదేశ ప్రజలు నిరోచితంగా పోరాడుతున్నారు. పెట్టుబడిదారీ ప్రభుత్వ నిర్బంధ చర్యలనూ సోషలిస్టునాయకుల విచ్ఛిన్న చర్యలనూ ఎదుర్కొంటూ ఆయాదేశాల్లో కార్మికోద్యమం ముందుకు సాగిపోతూ ఉంది.

సామ్రాజ్యవాదుల యుద్ధోన్మాదక చర్యలను యావత్ప్రపంచం అసహ్యించుకుంటోంది. ప్రజలంతా శాంతి నభిలషిస్తున్నారు. ప్రగతిశీలమైన వాతావరణంలో సాంఘికజీవితం గడపాలని వారు వాంఛిస్తున్నారు. యుద్ధకాలంలోచేసిన వాగ్దానాలన్నిటినీ చెల్లించమని తమ తమ ప్రభుత్వాలను నిలవదీసి అడుగుతున్నారు. ఈనాడు సైన్సు ఎంతో పురోగమించింది. ఉత్పత్తి నెంతో ఎక్కువగా కొనసాగించే అనేక సదవకాశాలు లభించాయి. గుత్త పెట్టుబడిదారుల స్వార్థలాభాల నరికట్టి విజ్ఞాన శాస్త్రాన్ని సరిగా సక్రమంగా ఉపయోగించుకోగలిగితే మానవజాతి అంతా సుఖంగా శాంతియుతంగా జీవించగలదు.

అభివృద్ధి నిరోధక శక్తులకంటె ప్రజాస్వామిక శక్తులు నేడెంతో బలీయంగా ఉన్నాయి. ప్రజాస్వామిక శక్తులన్నీ ఐక్యమై తమ ఆశయసాధనకు దృఢసంకల్పాన్ని ప్రదర్శించే పక్షంలో అవి తప్పకుండా విజయాన్ని సాధిస్తాయి.

కాబట్టి ప్రజాస్వామిక శక్తులన్నిటినీ సంఘటితపరచడం, బలపరచడం - ఇదే శాంతిప్రియులందరూ చేయవలసిన నేటి ప్రధాన కర్తవ్యం. ఈ ప్రజాస్వామిక శక్తులన్నింటికి మార్గదర్శిగాఉండి కార్మిక వర్గం తన కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది.

## స్త్రీ పురుష కార్మికులారా !

జాతీయంగా, అంతర్జాతీయంగా కార్మికోద్యమాన్ని పూర్తిగా బలపరచవలసిందని - అభివృద్ధి చేయవలసిందని ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ మీ అందరికీ విజ్ఞప్తి చేస్తూఉంది.

విచ్ఛిన్నపు ఎత్తుగడలకూ, విచ్ఛేదకులకూ వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం జరపండి! యుద్ధోన్మాదులకు వ్యతిరేకముగా శాంతిని కాపాడేందుకు మీరందరూ ఏకంకండి! కార్మికుల జీవన ప్రమాణాన్ని పెంచడానికీ, కార్మికుల ప్రయోజనాలను కాపాడడానికీ, ప్రజాస్వామిక హక్కులకోసం, ట్రేడ్ యూనియను ఫెడరేషన్‌జరిపేపోరాటాన్ని బలపరచండి.

**అంతర్జాతీయ కార్మికదినం-మేడే-వర్ధిల్లాలి!**

**వివిధదేశాల కార్మికులందరిలో అంతర్జాతీయ కార్మిక ఐక్యతా సుహృద్భావాలు వర్ధిల్లాలి!**

**ప్రపంచ కార్మిక సంఘైక్యత వర్ధిల్లాలి!**

**ప్రపంచశాంతి సంఘటన వర్ధిల్లాలి!**

**ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ వర్ధిల్లాలి!**

**విప్లవం వర్ధిల్లాలి!!!**

# ఇండోనేషియా అనుభవం నేర్పుతున్న పాఠాలు

షా పింగ్

మూడు సంవత్సరాల క్రిందట స్థాపించబడ్డ ఇండోనీషియా రిపబ్లిక్ గత డిసెంబరులో డచ్ సామ్రాజ్యవాదుల దాడికో కూలిపోయింది. అప్పటినుండి ఇండోనీషియా ప్రజల జాతీయ విముక్తి పోరాటం ఒక నూతన దశలో ప్రవేశించింది. డచ్చిసామ్రాజ్యవాదులు కొత్తగా దాడి ప్రారంభించిన మూడుమాసాల లోపుననే ఇండోనీషియా అంతటా విజృంభించిన గెరిల్లాపోరాటం 1,30,000 డచ్చిసైన్యాలను ఎక్కడివాటి నక్కడ నిలుపవేయగలిగింది. సరియైన నాయకత్వం వున్నపక్షంలో ఇండోనీషియా ప్రజల జాతీయ విముక్తి ఉద్యమానికి గొప్ప భవిష్యత్తుంది..

ఇండోనేషియా 350 సంవత్సరాలకు పైగా విదేశ సామ్రాజ్యవాదుల బానిసత్వముక్రింద అనేక బాధలననుభవించింది. సామ్రాజ్యవాదుల దురాక్రమణకూ, బానిసత్వానికి వ్యతిరేకంగా ఇండోనీషియా ప్రజలు వీరోచితంగా ప్రతిఘటించారు. రెండో ప్రపంచయుద్ధం జయప్రదంగా ముగియడాన్ని అవకాశంగా తీసుకోని ఇండోనీషియా ప్రజలు 1945 ఆగస్టు 17 వ తేదీన తమజాతీయ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోగలిగారు. కాని దురదృష్ట వశాత్తూ రిపబ్లిక్ రాజ్యాధికారం కొంతమంది అభివృద్ధినిరోధకుల చేతులలో పడిపోయింది. వీరిలో కొంతమంది ఫ్యూడల్ రాజరికానికి సంబంధించినవారు. జపాన్ డచ్చి సామ్రాజ్యవాదుల క్రిందా తుదకు జపాన్ ఆక్రమించిన సమయంలో ఫాసిస్టుల క్రింద పనిచేసినవారు కూడా వున్నారు. ఈ ముఠా తమకు అధికారం చేజిక్కిన వెంటనే ప్రజలను విడిచిపెట్టింది. అంతే కాదు. ప్రజల యెడల వ్యతిరేక వైఖరిని అనుసరించి చివరకు తమ దేశంలోని, ప్రజలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటనబలాన్ని బలహీనపరచారు. అందుచేత వారు జాతీయ విముక్తి మహాదాశయ బాధ్యతను నిర్వహించలేరు. తాము స్థాపించుకొన్న "రిపబ్లిక్" ను డచ్ సామ్రాజ్యవాదుల దాడినుండి రక్షించుకోలేరు. నెహ్రూ, జిన్నా, ఫిబన్ సంగ్రామ్, క్విరినో, సిగమాన్‌లీ లాంటి ప్రాచ్యదేశాలలోని బూర్జువా నాయకులకు గల దృక్పథమే సరిగ్గా వీరికి

ఉంది. బలహీనమైన జాగులు సామ్రాజ్య వాదులపై ఆధారపడకుండా విముక్తి పొందలేవు అన్న భావం వారిలోవుంది. ఒకవేళ "స్వాతంత్ర్యాన్ని" సాధించగలిగినా "అమెరికా సహాయం" లేకుండా అవి నిలువలేవనే దృక్పథంకూడా వీరికుంది.

1946 నవంబరులో ఆంగ్లో - అమెరికన్ల "మధ్య వర్తిత్వాన" జరిగిన లింగడ్జట్ ఒడంబడిక 1948 జనవరిలో అమెరికా వారి జోక్యంతో జరిగిన రెన్విలీ ఒడంబడిక, లొంగిపోయే తత్వంతోకూడిన బూర్జువా దృక్పథంతోనే జరిగాయి. ఆ తరువాత ఫాస్సఫాచ్ ఒడంబడిక జరిగింది. ఇందులో మార్షల్ ప్లాన్ అని పైకి చెప్పకుండా రహస్యంగా వుంచినా యీ ఒడంబడికను అంగీకరించడమంటే చైనా, గ్రీస్, టర్కీలలో వున్న అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలు అమెరికా సామ్రాజ్య వాదుల ఆర్థిక మిలిటరీ సాయంతీసుకొన్న ఫలితమే దీనికీ ఉంది.

అమెరికా సామ్రాజ్యవాదుల ఆజ్ఞలను శిరసావహించి, హట్టాప్రభుత్వం స్వదేశంలోనూ, విదేశాలలోనూ కమ్యూనిస్టు వ్యతిరేక, ప్రజావ్యతిరేక పాలసీలను అనుసరించింది. సోవియట్ యూనియన్ తో స్నేహపూరితమైన సంబంధాలను ఏర్పరచుకొని రాజకీయ సంబంధాలను వుంచుకోడానికి నిరాకరించింది.

ఈ విధంగా ఇండోనీషియాలోని హట్టా ప్రభుత్వం మొట్టమొదట ప్రజావ్యతిరేక దృక్పథంతో ప్రారంభమై తుట్టతుదకు సిగ్గువిడచి దేశాన్నే అమెరికా సామ్రాజ్యవాదుల చేతులలో పెట్టింది. స్వదేశంలోనూ, విదేశాలలోనూ పూర్తిగా అభివృద్ధి నిరోధక పాలసీని అనుసరించడం ప్రారంభించింది.

## చైనా విజయాలు నేర్పుతున్న పాఠాలు

అదే సమయంలో - 1948 సంవత్సరం ఆఖరులో జరిగిన డచ్చి సామ్రాజ్యవాదుల రెండో దాడితోపాటు ప్రాచ్యదేశాలలో ఒక దేశమైన చైనాలో ప్రపంచాన్నంతటినీ వూగిసలాడించిన ఒకమహత్తర సంఘటనజరిగింది. చైనా ప్రజలు అపూర్వమైన విప్లవశక్తితో ఇంటాబయటావున్న బలవత్తరమైన శత్రువులను ఓడించారు. కాబట్టి ఇండోనీషియా ప్రజలు తమ అనుభవాన్నుండేగాక, చైనా అనుభవాల నుండి కూడా నేర్చుకోదగిన పాఠాలున్నాయి.

చైనా ప్రజల విప్లవపోరాటం యీ క్రింది ముఖ్యమైన ప్రాథమిక పాఠాలను యివ్వగలిగింది.

**—మొదదటిది: విప్లవశ్రామిక వర్గ ఐక్యతపై ఆధారపడిన సరైన నాయకత్వంవుండి మామూలు ప్రజానీకాన్నంతటినీ పోరాటంలోకి ఆకర్షించి, రాజకీయంగానూ మిలిటరీ రీత్యానూ సరియైన పంథాను అవలంభించ గలిగితేనే జాతీయ విముక్తి ఉద్యమం జయప్రదం కాగలుగుతుంది. బూర్జువా ఫ్యూడల్, ఛోటాబూర్జువా వర్గాలు జాతీయవిముక్తి ఉద్యమాలకు నాయకత్వం వహించలేవు. ఆ వర్గాల నాయకత్వం ఓటమికీ లొంగుబాటుతనానికి మాత్రమే దారితీస్తుంది.**

జాతీయ విముక్తి పోరాటంలో శ్రామికవర్గం జాతీయ సంయుక్త సంఘటనను నిర్మించాలి. ఈ సంయుక్త సంఘటన కార్మిక జన సామాన్యాన్నీ, రైతు జన సామాన్యాన్నీ కష్టపడి పనిచేసే యితర జనసామాన్యాన్నీ పునాదిగా ఏర్పరచుకోవాలి. మొట్టమొదట ఈ ప్రజలలో విప్లవ చైతన్యాన్ని రేకెత్తించి వారి ఆర్థిక, రాజకీయ కోర్కెలను తృప్తిపరచాలి. అప్పుడే తీవ్ర స్వభావంగల సంయుక్త సంఘటననూ, శ్రామిక వర్గ నాయకత్వాన్నీ నిర్మించగలుగుతాము.

ఆయా పరిస్థితులకు తగినట్లుగా బూర్జువా వర్గంతో ఎంతవరకూ, ఏ పద్ధతిని ఐక్యతను కలిగివుండాలో కూడా యీ సంయుక్త సంఘటనా సంస్థ నిర్ణయించాలి. బూర్జువా వర్గంలో శత్రుపక్షానికి లొంగిపోయే భాగాన్ని మాత్రం తీవ్రంగా ప్రతిఘటించాలి. సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథంతో ఏకీభవించే బూర్జువావర్గ భాగంతో మాత్రం ఒక నిర్ణీత కార్యక్రమాన్ని ఆధారం చేసుకొని కలసి ఐక్యతతో పనిచేయాలి. ఆవిధంగా సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథంగల బూర్జువా శక్తులతో కలసి పనిచేస్తూనే మరోవైపున వారి ఊగిసలాట వైఖరినీ, రాజీభావాలనూ ఎడతెగకుండా ఒక క్రమ పద్ధతిని బట్టబయలు చేస్తూ వుండాలి. అనుకున్న నిర్ణయాలను కార్యక్రమాలనూ సరిగా అమలు జరపని పక్షంలో అమలు జరుపుతున్నప్పుడు, వూగిసలాటను ప్రదర్శించుతున్నప్పుడూ బూర్జువావర్గ రెండురకాల స్వభావాలను తూర్పార బట్టాలి. అప్పుడే ప్రజానీకాన్ని బూర్జువావర్గంయొక్క మోసపు పలుకుబడినుండి విముక్తి చేయగలుగుతాము. ఆ విధంగానే శ్రామిక వర్గ నాయకత్వమూ, తీవ్ర స్వభావంగల జాతీయ సంయుక్త సంఘటనా నిర్మించబడుతాయి.

దేశంలో ఆంతరంగికంగా సంయుక్త సంఘటనను నిర్మించడమే గాకుండా, జాతీయ పోరాట శక్తులు అంతర్జాతీ సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులతో ఐక్య సంఘటనను నిర్మించుకోవాలి. అంటే సోవియట్ యూనియన్ తోనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలన్నింటితోనూ, వివిధ

దేశాలలోని శ్రామికవర్గాలతోనూ, వలస అర్ధవలస దేశాలలో అణచబడుతున్న ప్రజలతోనూ ఐక్య సంఘటనను ఏర్పరచుకోవాలి. వివిధదేశాలలో వుండే బూర్జువా వర్గాల మధ్య నుండే పరస్పర విరుద్ధతలను వినియోగించుకోవడం కూడా అవసరమే. కాని అంతమాత్రం చేత ఏదేశంలోని బూర్జువావర్గమైనా విప్లవానికి పూర్తిగా అనుకూలంగా వుంటుందని భావించరాదు. అంతర్జాతీయ రంగంలో జాతీయ విముక్తి ఉద్యమాలకు సోవియట్ యూనియన్‌నూ వివిధ దేశాలలోనివిప్లవపూరిత శ్రామిక వర్గాలు మాత్రమే ఖచ్చితమైన మిత్రులుగా వుంటాయని తెలుసుకోవాలి.

## సాయుధ పోరాటం: కమ్యూనిస్టుపార్టీ

—రెండు: జాతీయ పోరాటం యొక్క ప్రధానస్వభావం ఆయుధ పోరాటమై వుండాలి. అంటే శ్రామికవర్గం నాయకత్వాన విప్లవ సైన్యాన్ని నిర్మించాలి. శత్రువుకూ - మనకూ మధ్య వున్న సంబంధాలను బట్టి పోరాట విధానాన్ని నిర్ణయించుకోవాలి. శత్రువు చాల బలవత్తరంగా వున్న సమయంలో మొట్టమొదట్లో గ్రామీణ ప్రాంతాలలో ప్రజాగెరిల్లా పోరాటాలను అభివృద్ధి చేయడం అవసరం. ఆవిధంగా గెరిల్లాపోరాటాలను అభివృద్ధి పరచుకొంటూ మరో ప్రక్కని విప్లవశక్తులను తయారు చేసుకోడానికీ, కేడర్లకు తర్ఫీదు నివ్వడానికీ, పరిపాలనా నిర్ణయాలను అమలు జరపడానికీ, విప్లవం పలుకుబడిని విస్తరింప జేయడానికీ, ఆ తరువాత పరిస్థితులు పరిపక్వదశకు వచ్చినప్పుడు నగరాలనూ, ఓడరేవులను స్వాధీనం చేసుకోడానికీ ఒక విప్లవ కేంద్రాన్ని నిర్మించుకోవాలి.

— మూడు: శ్రామిక వర్గానికి అగ్రగామి అయిన కమ్యూనిస్టు పార్టీని ప్రజాబాహుళ్యంగల విశాల రాజకీయ పార్టీగా నిర్మించాలి.' సిద్ధాంతరీత్యా, రాజకీయంగా, నిర్మాణరీత్యా పార్టీని అభివృద్ధిపరచాలి. ఆపార్టీ సర్వసత్యయుతమైన మార్క్సిజం - లెనినిజాన్ని తన దేశంలోని ప్రజల ఆచరణ విప్లవ కార్యకలాపాలతో సమన్వయపరచడం నేర్చుకోవాలి. అలాంటి పార్టీయే సరియైన రాజ

కీయ విధానాన్నీ, సిద్ధాంతాన్నీ, పంథాను నిర్ణయించి ప్రజలను జాతీయ ప్రజాతంత్ర విప్లవ విజయానికి నడపగలుగుతుంది.

చైనా ప్రజలు విజయాలను పొందడానికి కారణభూతమైన యీ ప్రధాన అనుభవాలు ఇండోనీషియాకూ, యింకా నేడు అణచబడిన యితర ఆసియా దేశాలకు చాల ఎక్కువ సహాయకారిగా ఉంటాయి.

## రెండు విభిన్నపంథాలు

ఇండోనీషియా బూర్జువా రిపబ్లిక్ యొక్క అవమానకరమైన ఓటమి ఒక వైపునా, చైనాప్రజల ప్రజాతంత్ర విప్లవంయొక్క మహత్తర విజయాలు మరో వైపునా-రెండూ-ఆసియాప్రజలకు రెండు విభిన్న పంథాలు చూపెడుతున్నాయి.

మొదటిపంథారాజీపంథా, సామ్రాజ్యవాదానికి లొంగిపోవడానికి దారితీసే పంథా, ప్రజావ్యతిరేకపంథా, ఫ్యూడల్ భూస్వాముల, నిరంకుశవాదుల, నిరంకుశ పెట్టుబడిదారులపంథా. ఆపంథా కమ్యూనిస్టు వ్యతిరేకతకూ, సోవియట్ వ్యతిరేక మార్షల్ ప్లానుకూ ఆసియా పథకం మాత్రమే. అది జాతీయ ఓటమికీ, జాతీయ బానిసత్వానికీ దారితీసే పంథా.

ఇక రెండోపంథా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఖచ్చితంగా తుదివరకూ పోరాటంసాగించే పంథా. అది ప్రజాస్వామిక ప్రజాతంత్రపంథా. శ్రామికవర్గ నాయకత్వాన కష్టజీవులను ఆధారంగా చేసుకొని సామ్రాజ్యవాదానికీ, భూస్వామిక విధానానికీ వ్యతిరేకంగా పోరాడటానికి అంగీకరించిన జాతీయ బూర్జువాను కలుపుకొని పోరాడేపంథా. వలస బానిసత్వ విధానాన్ని పూర్తిగా తుదముట్టించడానికి ప్రపంచమంతటా శాంతి, ప్రజాస్వామికాలకోసం కృషిచేసే ప్రజాశక్తులతో ఐక్యమయ్యేపంథా. జాతీయ విముక్తికీ, విజయానికి ఇదొక్కటేపంథా.

ఇండోనేషియాపై డచ్చి సామ్రాజ్యవాదుల దురాక్రమణ చరిత్రయే డచ్చి దురాక్రమణకు వ్యతిరేకంగా ఇండోనీషియా ప్రజలు సాగించిన సాయుధ ప్రతిఘటనా చరిత్ర అవుతుంది. కాని కొన్ని దశాబ్దాల వెనుకటికంటే యీనాడు డచ్చి సామ్రాజ్యవాదం చాల బలహీనంగా వుంది. అదే సమయంలో కొద్ది శతాబ్దాలక్రితంకంటే ఇండోనీషియా ప్రజల చైతన్యం, ఐక్యతాభావం ఈనాడు చాల అధికంగా ఉంది. డచ్చి సామ్రాజ్యవాదులకు మద్దతుగా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు వున్నమాట నిజమే. కాని ఇండోనీషియా ప్రజలకు అండగా అమెరికా, బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకంటే బలవత్తరంగావున్న సోవియటు యూనియన్ నాయకత్వాన ప్రపంచ సామ్రాజ్యవాద ప్రతికూల సంఘటన ఉంది. సరియైన విప్లవపంథా వెనుక ఇండోనేషియాలోని శ్రామిక ప్రజలంతా ఐక్యమై సామ్రాజ్యవాదులూ వారి ఏజంట్లపై ఎలాంటి భ్రమలులేకుండా తమస్వశక్తిపై తమ స్వంతబలంపై ఆధారపడి పోరాడితే 7 కోట్ల ఇండోనిషియా ప్రజలు తమ జాతీయ విముక్తి పోరాటంలో అంతిమ విజయం పొందడం తథ్యం.

గత మూడున్నర సంవత్సరాలలోకి గడించిన అనుభవంతో ఇండోనీషియా ప్రజలు ఓటమికీ, లొంగుబాటుతనానికీ దారితీసే బూర్జువా పంథాను త్యజించి ప్రజా విప్లవ విజయానికి దారితీసేపంథాను చేబడతారనే విశ్వాసం మాకు పూర్తిగా ఉంది. ఇండోనేషియా ప్రజలు శ్రామిక వర్గ నాయకత్వాన తమ మాతృభూమినుండి సామ్రాజ్యవాదాన్ని తరిమి సంపూర్ణమైన జాతీయ విముక్తిని సాధించి, యీనాడు చైనా ప్రజలు నిర్మించుతున్నట్లే తామూ ప్రజాస్వామిక ఇండోనేషియా రిపబ్లిక్‌ను స్థాపించి తీరుతారు.

—చైనా డైజెస్టు నుండి
(5—4—49)



"మార్క్సిజం — లెనినిజంను సరిగా జీర్ణించుకొని ప్రజలలో నమ్మకం వుంచుకొని, ప్రజలతో నిలబడి, వారికి నాయకత్వం వహించి నడిపితే ఎంతటి తీవ్రమైన అడ్డంకుల నైనా దాటగలం. ఎంతటి కష్టములలోనైనా విజయాన్ని సాధించగలం. మన బలానికి ఎదురులేదు. ప్రపంచ మంతటా సామ్రాజ్యవాదమూ, పెట్టుబడిదారీ విధానమూ అంతం కాబోతున్న చారిత్రక సమయమిది సోషలిజమూ, ప్రజాస్వామికమూ పురోగమిస్తున్న సమయమిది. విజయ భానూదయం వెంటనే కాబోతున్నది. ఆత్మవిశ్వాసంతో నడుములు బిగించండి!!

— కామ్రేడ్ మావోసియాంగ్

25

## మిచూరిన్ సిద్ధాంతం:

# జీవశాస్త్రంలో ఒక నూతనాధ్యాయం

ఐ. ప్రెజెంట్

(11–7–48 నుంచి 7–8–48 వరకు జరిగిన 'లెనిన్ ఆల్ యూనియన్ వ్యవసాయశాస్త్ర పరిషత్' సమావేశము యొక్క సమగ్రమైన (లైసెంకో) రిపోర్టును సమీక్షచేస్తూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక 'ప్రవద' 1–9–48 న ప్రచురించిన వ్యాసాన్ని ఈదిగువ ఇస్తున్నాం—సంపాదకుడు.)

కమ్యూనిజం వైపు పురోగమిస్తోన్న సోవియట్ ప్రజల జీవితంలో 1949 సంవత్సరం వేసవిలో అత్యంత ప్రాముఖ్యమైన ఘటనొకటి జరిగింది. ఈ ఘటన ఒక్క సోవియట్ ప్రజాజీవితంలోనే కాక ప్రపంచ విజ్ఞానవిజయాలలో ప్రధాన స్థానం అలంకరించుతుంది. లెనిన్ ఆల్ యూనియన్ వ్యవసాయశాస్త్ర పరిషత్ సమావేశాన్ని గూర్చి మేమిక్కడ ప్రస్తావిస్తున్నాం. ఎంగిల్స్ మహాశయుడు శాస్త్రీయమైన దృక్పథంతో సోషలిస్టు విప్లవం యొక్క చారిత్రాత్మక విలువను ఊహించాడు. దానిని ఈ పరిషత్తు రుజువుచేసి, ముందంజ వేసింది.

"పశుపక్ష్యాదుల జీవిత సంస్థలను మానవుడు పూర్తిగా విసర్జించి, శాశ్వతంగా వేరైపోయాడు. మానవుడుగా జీవించేందుకు కావలసిన నూతన పరిస్థితుల్లోకి అడుగుపెట్టాడు. ఇప్పటి వరకు మానవుడు ప్రకృతికి తలొగ్గి జీవిస్తూ వచ్చాడు. కాని ఇంతవరకూ సామాజిక సూత్రాలను మాత్రం తీర్చి దిద్దుతూ వచ్చిన మానవుడు ప్రకృతిని పూర్తిగా జయించాడు." ("సోషలిజం: ఊహాజనితం, శాస్త్రీయం").

సామ్రాజ్యవాదానికి పెంపుడు కుక్కలైన భావవాదులు ముఖ్యంగా ఇంగ్లండు అమెరికాలలో పై పరిషత్తు సమావేశాన్ని పురస్కరించుకొని గాలి దుమారాన్ని రేపారు. సోవియట్ వ్యతిరేకతను, కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొడుతూ రొచ్చుగుంట ప్రచారం సాగించారు. ఇది కొత్త విషయంకాదు. సమయం దొరకినప్పుడల్లా యిట్టి తప్పుడు ప్రచారాన్నే చేస్తూ

వచ్చారు. వాళ్ళనుగూర్చి చెప్పటానికి సిగ్గేస్తుంది. ఉదాహరణకు వాల్‌స్ట్రీటుకు అమ్ముడు పోయిన శాస్త్రవేత్త ప్రొఫెసర్ హెచ్. జె. ముల్లర్‌నే తీసుకుందాం. యుద్ధోన్మాదశాస్త్రవేత్తలకు విజ్ఞాన విజయాలను దుర్వినియోగం చేసేవారికి తలొగ్గుతూ ఈ ప్రొఫెసర్ యీ మధ్య ఒక "సాహిత్య" పత్రికలో పెద్ద పెద్ద అక్షరాలలో చెంపలు వేసుకున్నాడు. సోవియట్ సైన్స్ ఎకాడమీ సభ్యత్వానికి రాజీనామా యిచ్చాడు. ఈ రాజీనామా పత్రానికి సోవియట్ అకాడమీ అధ్యక్ష వర్గం ఇలా సమాధానం ఇచ్చింది.

"సంస్కృతిని సర్వనాశనం చేసేందుకు మానవజాతిని మట్టుపెట్టుటకు అమెరికన్ సామ్రాజ్యవాదులు విజ్ఞాన విజయాలను దుర్వినియోగం చేస్తుంటే నోరుమెదపని ప్రొఫెసర్ ముల్లర్ మానవ జాతి శుభోదయానికి అపారంగా తోడ్పడుతున్న మిచూరిన్ జీవశాస్త్రంపై దండెత్తడం చాలా హాస్యాస్పదం....

విజ్ఞానశాస్త్రంయొక్క పరమాశయాలను తిలోదకాలిచ్చి విజ్ఞానానికి పురోభివృద్ధికి, శాంతికి, ప్రజాస్వామ్యానికి గర్భశత్రువులైన అభివృద్ధినిరోధక కూటమితో కలసిపోయిన ప్రొఫెసర్ ముల్లర్ విడిపోతున్నందుకు సోవియట్ సైన్సు ఎకాడమీ ఏమాత్రం చింతిల్లడంలేదు.

అవిరళమైన శాస్త్రీయకృషి ఒకచక్కటి పుస్తకరూపంలో మనకు లభ్యమవుతోంది. లెనిన్ ఆల్ యూనియన్ అగ్రికల్చరల్ పరిషత్ సమావేశంయొక్క సమగ్రమైన రిపోర్టే ఈ పుస్తకం. శాస్త్రవేత్త టి. డి. లైసెంకో "జీవశాస్త్రస్థితిగతులు" (ది స్టేట్ ఆఫ్ బయలాజికల్ సైన్స్) పైన యిచ్చిన రిపోర్టు దానిపైన సమగ్రంగా జరిగిన చర్చల సంపూర్ణమైన వివరాలు యీ పుస్తకంలో వున్నాయి. ఈ చర్చలలో 56 మంది ప్రముఖులు పాల్గొన్నారు. వారిలో ఎకాడమీ శాశ్వత సభ్యులూ, వ్యవసాయికశాస్త్రపరిశోధక సంస్థల్లో పనిచేసేవారూ, వ్యవసాయ కళాశాలలో పనిచేసే ప్రొఫెసర్లూ, జీవశాస్త్రసంస్థల్లో కృషిచేసే విజ్ఞానవేత్తలు, సోవియట్ వ్యవసాయశాఖ, 'సోల్‌ఖోజ్' శాఖామంత్రులూ, యంత్ర నిపుణులూ పాల్గొన్నారు.

సోవియట్ ప్రజలు సిద్ధాంతజీవితానికి సంబంధించిన మహత్తర ఘటనల్లో ఈ మహాసభ ఒకటి. శాస్త్రవేత్త టి. డి. లైసెంకో యిచ్చిన రిపోర్టు ఇతర శాస్త్రవేత్తల చర్చల సారాంశం, శాస్త్రవిజ్ఞానానికి సంబంధించి చాలా ప్రాముఖ్యమైన విషయాలు. శాస్త్రరంగాలలో కృషిచేసేవారికి ముఖ్యంగా వ్యవసాయకశాస్త్రంలో పనిచేసేవారికి, పార్టీ వర్కర్లకూ ఇతోధికంగా యీ మహాసభ తోడ్పడుతుందనేవిషయం నిర్వివాదాంశం. మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథానికి మూలాధారమైన విజ్ఞానశాస్త్రాలలో జీవశాస్త్రం (బయాలజీ) అత్యంతముఖ్యమైనది. జీవుల పుట్టుక పరిణామసూత్రాలను తెలియచేసేదే జీవశాస్త్రం. ప్రపంచ పరిణామాన్నిగూర్చి మానవుని శక్తిసామర్థ్యాలను గూర్చి భౌతిక భావవాదుల మధ్య సిద్ధాంతరీత్యా ఒక పెద్దసంఘర్షణ నానాటికి ఉద్ధృతరూపం చెందుతోంది. మనలను ఎదుర్కొనే అనేక పృథుతర సమస్యలను తీర్చేదిగా జీవశాస్త్రాన్ని మనం వినియోగించుకోవాలి. దీనివల్ల ఉత్పత్తిని అపారంగా పెంచుకోగల్గుతాం.

మహాసభ యొక్క ఈ సమగ్రమైన రిపోర్టు అత్యంత శాస్త్ర ప్రాధాన్యంగల గ్రంథం. టి. డి. లైసెంకోయొక్క

సిద్ధాంతబద్ధమైన చక్కటి రిపోర్టు, ఇతర మిచూరిన్ శాస్త్రవేత్తల వ్యాఖ్యలు మన విజ్ఞానశాస్త్రానికి నూతన జీవం పోస్తున్నాయి. కొన్ని సంవత్సరాలుగా వీస్మాన్ వాదుల, మిచూరిన్ వాదులమధ్య జరుగుతూన్న సిద్ధాంత సంఘర్షణ పర్యవసానమే యీ సమగ్ర నివేదిక. అభ్యుదయకరమైన మిచూరిన్ జీవశాస్త్రం ఆచరణలో సాధించిన అఖండ విజయాలు యిందులో వివరించబడ్డాయి. ప్రకృతి శాస్త్రానికి సంబంధించిన విజ్ఞానం మాత్రమేకాక, పాఠకులకు కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి విజ్ఞానశాస్త్రం ఎంత అవసరమో యీ పుస్తకం తెలియజేస్తుంది.

జీవశాస్త్రంలో రెండు రకములైన విభిన్నదృక్పథా లున్నవని వివరిస్తూ లైసెంకో తన రిపోర్టులో తెలియచేసాడు. వాటిలో ఐ. వి. మిచూరిన్‌చే ప్రవేశపెట్టబడిన అభ్యుదయకరమైనదొకటి. ఈ దృక్పథానికి ఆధారం భౌతికవాదం. మిచూరిన్ ప్రఖ్యాత సోవియట్ విజ్ఞానవేత్త. ప్రకృతిని మానవోపయోగంగా మార్చిన దిట్ట. ఇక పోగా రెండవది అధ్యాత్మిక చింతతోకూడి, అభివృద్ధి నిరోధకతత్వంగల దృక్పథం. జర్మన్ జీవశాస్త్రవేత్తవీస్మాన్‌చే ఇది ప్రవేశపెట్టబడింది. సన్యాసత్వంపుచ్చుకొన్న ఆస్ట్రేలియన్ జీవశాస్త్రవేత్త మెండల్, అమెరికన్ జీవశాస్త్రిమోరగన్‌లు వీస్మాన్ వాదాన్ని బలపరచారు. జీవశాస్త్రి చరిత్రను పరికిస్తే సిద్ధాంతానికి సంబంధించిన సంఘర్షణ అనాదిసిద్ధంగా వస్తూనే వుంది. 1809, 1882, మధ్యకాలంలో చార్లెస్ డార్విన్ కృషిచేసి శాస్త్రీయమైన జీవశాస్త్రిసూత్రాలను నిర్వచించాడు. 1859 "ది ఆరిజిన్ ఆఫ్ ది స్పెసిస్"అనే గ్రంథాన్ని ప్రకటించాడు. జీవులపుట్టుక, పరిణామాన్నిగూర్చి అనేక వుదాహరణలతో శాస్త్రీయమైన వివరణను యిచ్చాడు. ఇది అధ్యాత్మిక వాదాన్ని పూర్తిగా తిరస్కరించింది. మార్క్సిజమ్, లెనినిజమ్‌లనుగూర్చి మూల గ్రంథాలను రచించిన ప్రవక్తలందరూ, డార్విన్ కృషికి ఎంతో విలువనిచ్చారు. డార్విన్‌ను గురించి టి. డి. లైసెంకో ఈ క్రింది విధంగా వుద్ఘాటించాడు:

"డార్విన్ సిద్ధాంతంప్రాముఖ్యతను మార్క్సిస్టు ప్రధాన రచయితలు ఎప్పుడో గుర్తించారు. కాని వారే డార్విన్ సిద్ధాంతంలోని లోపాలను కూడా ఎత్తిచూపారు. డార్విన్ సిద్ధాంతం ప్రధానంగా భౌతికవాదదృక్పథంతో వున్నప్పటికి దానిలో చాలా ముఖ్యమయిన లోపాలుకూడా కలవు. ఉదాహరణకు డార్విన్ అభివృద్ధి నిరోధక 'మాల్తూషియన్'అభిప్రాయాలను పరిణామ వాదానికి సంబధించిన తన సిద్ధాంతంలో భౌతిక వాద సూత్రాలతో పాటు చొప్పించాడు. ఇది పెద్దలోపం. ఈలోపాన్ని ప్రస్తుత అభివృద్ధి నిరోధక జీవశాస్త్రవేత్తలు మరింతగా పెంచుతున్నారు."

మాల్తూస్ ఇంగ్లీషు మతాధికారి "మానవాతీతమయిన ప్రకృతి సూత్రం"

వల్ల ప్రాణిజీవులు తిండికంటె ఎక్కువ వేగంగా అభివృద్ధి చెందుతున్నాయి. (జనాభా పెరుగుదలలో) ఈ అభివృద్ధి నిరోధక అభిప్రాయాన్ని మాల్తూస్ ప్రచారం చేసాడు. ఈవిధంగా జనాభా పెరుగుదలఅనే కారణంతో పెట్టుబడిదారీ విధానంలో కాల్విన్‌వర్గ పేదరికాన్ని సమర్ధించ చూచారు.

ఈ దిక్కుమాలిన మాల్తూసియన్ సూత్రాన్నే డార్విన్ ఎరువు తెచ్చుకున్నాడు. దీని ద్వారా ప్రకృతిలో జీవించేందుకు జరిగే సంఘర్షణను వివరించ చూచాడు. కాని తన సిద్ధాంతానికి మూలమయిన భౌతిక వాదసూత్రాలనే ఇది పూర్తిగా ఖండిస్తోంది అని గుర్తించలేక పోయాడు. ఏమయినప్పటికి డార్విన్ తానుచేసిన తప్పులనుంచి తను విముక్తి కాలేక పోయాడు. మార్క్సిజాన్ని రచియించిన ప్రవక్తలు ఈ లోపాన్ని ఎత్తి చూపి వివరించారు.

అభివృద్ధి నిరోధక జీవశాస్త్రవేత్తలు డార్విన్ సిద్ధాంతంయొక్క భౌతికవాద దృక్పథాన్ని త్రోసిపుచ్చడానికి అనేకములయిన ప్రయత్నాలు చేసారు. యింకో ప్రక్క డార్విన్ సిద్ధాంతములోని అభివృద్ధి నిరోధక తత్వంతోకూడిన లోపాలను పెంచటానికి ప్రయత్నించారు. తద్వారా మాల్తూస్ ప్రచారంచేసిన "జనాధిక్య సూత్రాన్ని" బలపర్చుతున్నారు. దురదృష్టవశాత్తు మన దేశంలో కూడా వీస్మాన్ వాదులు, మోరుగాన్ వాదులు వున్నారు. స్మాత్ హాసిన్, జవదవస్కీ, జిబ్రాక్, డూబినిన్ మొదలయినవారు. వీరంతా అభివృద్ధినిరోధక జీవశాస్త్రవేత్తల అడుగుజాడలలోపోతూ వారి సిద్ధాంతాలను ప్రచారం చేశారు. అట్టి సిద్ధాంతాలపైనే తమ శాస్త్రకృషిని సాగించారు. అభివృద్ధి నిరోధకతత్వం కలిగిన ఆధ్యాత్మిక చింతతోకూడిన జీవశాస్త్రాన్ని నిర్వచించిన వారంతా తాము "అపరడార్విన్ వాదులని" చెప్పుకుంటారు. డార్విన్ సిద్ధాంతములోని భౌతికవాద దృక్పథాన్ని పూర్తిగా కాలదన్ని దానిలోకి ఆధ్యాత్మికవాదాన్ని మానవాతీత తత్వాన్ని జీవశాస్త్రంలోకి చొప్పించారు.

**అభివృద్ధి నిరోధక భావవాదపు జీవశాస్త్రం శరీర (ఆర్గనిజం) పరిణామములో వాతావరణ ప్రభావం వుండదని ఖండిస్తోంది. జీవితంలో వచ్చిన మార్పుల ఫలితంగా వృక్షాలయొక్క, జంతువుల యొక్క వారసత్వపు గుణాలలో మార్పువస్తోందనే విషయాన్ని తిరస్కరిస్తుంది.**

వీస్మాన్‌వాదులు శరీరాలను, అవి వుండే వాతావరణమునుంచి వేరుచేసి మరీ మాట్లాడుతారు. రూళ్ళక్రసిద్ధాంతముపై శరీర నిర్మాణాన్ని రెండుభాగాలుగా విభజించారు: వారసత్వానికి సంబంధించిన జీవకణాలు, వీటిద్వారానే వారసత్వం సిద్ధిస్తోందనీ ఈ సిద్ధాంతం చెప్తుంది. ఇక పోగా రెండవది శరీరం. శరీరానికి వారసత్వానికీ ఎట్టి సంబంధమూ ఉండదని వీరి ఉద్దేశం.

వారు వారసత్వరీత్యా సిద్ధించే పదార్థము శాశ్వతమయినటువంటిదిగా భావిస్తారు. శరీరాన్ని అట్టి పదార్థాన్ని భద్రపరచే కవచంగా మాత్రమే పరిగణిస్తారు. దీనిద్వారానే చేతనం లభిస్తుంది. ఈ అభివృద్ధినిరోధక సిద్ధాంతాన్ని లైసెంకో

తూర్పారబట్టాడు. శాస్త్రీయమైన వివర్శనలతో ఎదుర్కొన్నాడు. ఈ సందర్భంలో అతను ఇలా అన్నాడు:

"సజీవమయిన శరీరంలో దానియొక్క ప్రత్యేకమయిన గుణాల కతీతంగా వేరే వారసత్వపు శాశ్వత పదార్థమంటూ వుంటుంది. యీ పదార్థం నశించే శరీరాన్ని కాపాడుతూ ఉంటుంది. కాని ఆ శరీరం దీన్ని ఉత్పత్తి చేయలేదు—" అని వీస్మాన్ అభిప్రాయం. ఇది అధ్యాత్మిక వాదమనే విషయం అందరికీ తెలుస్తూంది. దీని అర్థం పరమాత్మమాయ తప్ప వేరు కాదు. నూతన డార్విను వాదం పేరుతో వీస్మాన్ ఎందుకూ పనికిరాని ఈ భావవాదాన్ని ముందుకు తీసుకువచ్చాడు.

భావవాద ప్రపూరితమయిన ఈ అభిప్రాయాలు వీస్మాన్ వాదులను మోరగాన్ వాదులను వారసత్వపు పదార్థం మనకు ఊహాతీతమయినదనే అభిప్రాయానికి తీసుకుపోయాయి. వీరు జీవిత పరిణామ సూత్రాలను అంగీకరించడానికి నిరాకరిస్తున్నారు. వృక్షాల జంతువుల పుట్టుక విషయంలో దైవిక సూత్రాన్ని అంగీకరించారు. వుదాహరణకు పదార్థ శాస్త్రవేత్త స్క్రోడింగర్ వీస్మాన్ సిద్ధాంతాన్ని పొగుడుతూ ఒక పుస్తకం వ్రాసాడు. దానిపేరు "పదార్థ శాస్త్ర దృష్టిలో జీవితం అంటే ఏమిటి?" దీనికతడు చెప్పిన సమాధానం యిది: "వ్యక్తిగత మయిన స్వతంత్ర ఆత్మ సర్వాంతర్యామి, సర్వజ్ఞాని పరమాత్మలతో సమానం." పైగా ఈ నిర్ణయాన్ని గురించి యింకా యిలా అన్నాడు. ఇది ప్రతి జీవశాస్త్ర వేత్త చెప్పుతున్నట్టిది. ఈ విధంగా ఒకే దెబ్బలో దేవుడువున్నాడనీ ఆత్మ శాశ్వత మయినదనీ వీరు చెప్పుతారు. మోరిగాన్ వాదాన్ని వీస్మాన్ వాదాన్ని బలపర్చే వారంతా ఇంత బహిరంగంగా బయట పడరు. కాని వారుతమ నిస్సహాయ స్థితిని ప్రకటిస్తూనే వుంటారు. జీవ ప్రపంచానికి సంబంధించిన సూత్రాలను అర్థం చేసుకునే తాహతులేక వీస్మాన్ మోరిగాన్ వాదులు జీవ ప్రపంచాన్ని మార్పు చేసేందుకు అశక్తులయ్యారు. అభివృద్ధి నిరోధక జీవశాస్త్రం యొక్క ప్రత్యేక గుణం యింకోటుంది. ఈ గుణమే ఆచరణలో ప్రజలయొక్క కోర్కెలకు అవసరాలకు తిలోదకాలివ్వటం. వీస్మాన్ వాదుల సిద్ధాంతం, ఆచరణ, వట్టి నిరుపయోగమయినట్టిదని లైసెంకో చెప్పుతూ ప్రొఫెసర్ డూబినిన్ కృషిని ఈ విషయంలో వుదాహరణగా తీసుకున్నాడు. ఈ ప్రొఫెసర్ సోవియట్ సైన్సుపరిషత్ సభ్యుడు. సంవత్సరాల తరబడి "కష్టపడి" పట్టణాల్లో వుండే పండ్లలోని జీవకణాలకూ గ్రామాల్లో ఉండే పండ్లల్లోని జీవకణాలకు తేడా కనిపెట్టాడు. యుద్ధకాలంలో జర్మన్ దురాక్రమణ నెదుర్కొంటున్న ప్రజలతోపాటు యితర శాస్త్రవేత్తలు కృషిచేస్తూవుంటే ఈ ప్రబుద్ధుడు యుద్ధ ప్రభావంవల్ల తేనెటీగల్లో ఏవిధమయిన రంగుమార్పు వస్తుందో అని పరిశోధన చేసాడు.

కృతక ప్రభావం ప్రవేశపెట్టితే వృక్ష, జంతు దేహ నిర్మాణంలో మార్పును తీసుకురావచ్చునన్న సత్యాన్ని వీస్మాన్ - మారగాన్ వాదం అంగీకరించదు. చక్కటి దృక్పథాన్ని కలుగచేయలేని విజ్ఞానశాస్త్రం, నిర్దేశించిన ఆశయాన్ని చేరేందుకు అనువైన మార్గాలను చూపెట్టలేని విజ్ఞాన శాస్త్రం పూర్తిగా నిరుపయోగం. అట్టిదాన్ని విజ్ఞానశాస్త్రమని పిలవటానికే వీలులేదు.

వాతావరణ పరిస్థితికి అతీతంగా దేహ నిర్మాణంలో కొన్ని వారసత్వ గుణాలు కలవనే అభిప్రాయం వీస్మాన్, మోరగాన్ వాదులను మరింతగా ఊబిలోకి తీసుకపోయింది. వారసత్వానికి సంబంధించిన గుణాలు హఠాత్ సంఘటనలపై ఆధారపడి వుంటవని చెప్పుతారు. కాబట్టే మోడల్ సూత్రాలను ఊసరవెల్లి సూత్రాలని మిచూరిన్ చక్కగా చెప్పాడు.

కొన్ని హఠాత్ సంఘటనల అల్లకల్లోలంగా జీవన ప్రకృతిని వీస్మాన్ — మోరగాన్ వాదులు భావిస్తారు. ఈ సంఘటనలకు ఒకదానికొకటి ఎట్టి సంబంధం వుండదు. వారి దృష్టిలో. కాని శాస్త్రీయమైన దృక్పథం ఈవిషయాన్ని అంగీకరించదు. కారణం విజ్ఞాన శాస్త్రం ప్రకృతి సూత్రాలను నిర్ణయించింది కనుక దైవ సంకల్పం సంభవమని ఒప్పుకోదు. "దైవసంకల్పం" అనే భావం ప్రకృతినిమార్చేందుకు జరిపే పోరాటంలో మనకు సాయపడకపోగా హాని కలుగచేస్తుంది. కనుకనే ఈ వాదం 'దైవకృపకై' అర్రులుచాస్తుంది. చివరకు అసమర్థతతో బయట పడుతుంది. "ఒక్క విషయం మనం మరచిపోరాదు. విజ్ఞాన శాస్త్రం హఠాత్ సంఘటనలకు ఆగర్భ శత్రువు" అన్నాడు లైసెంకో.

మార్క్సిజము - లెనినిజము మూలసూత్రాలలో యిది ఒకటి. అభ్యుదయ కాముక సోవియట్ శాస్త్రివేత్తలు డార్విన్ సిద్ధాంతంలో భౌతికవాద ప్రపూరితమైన సూత్రాలను రక్షించి, నానాటికి బలాన్ని చేకూర్చి పెట్టారు. ప్రఖ్యాత డార్వియన్ జీవశాస్త్రివేత్తలు మెచినికోవ్, సెచెనోవ్, సెవెర్టసోవ్ ముఖ్యంగా టిమిర్యజెవ్ మొదలైనవారు అభివృద్ధినిరోధక జీవశాస్త్రివేత్తలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటాన్ని అనేక రూపాల్లో సాగించి డార్విన్ సిద్ధాంతాలను రక్షించి మరీ పోషించారు.

ప్రకృతిని మార్చిన ప్రఖ్యాత పరిణామకుడు మిచూరిన్ ఒక కొత్తరకమైన జీవశాస్త్ర పాఠకులకు పునాది వేశాడు. కనుకనే సహజంగా దానికాపేరు వచ్చింది.

మిఛూరిన్ జీవశాస్త్రానికి దిట్టమైన పునాది గతితార్కిక భౌతికవాదం. గతతార్కికభౌతికవాదం వాదం అజేయమైనదని చరిత్రలోని అనుభవాలు రుజువు చేస్తున్నాయి. సామాజిక ప్రకృతి శాస్త్రాలుకూడా దాని ప్రత్యేకతను కాచివడపోసాయి. కనుకనే యిట్టి గతితార్కిక భౌతికవాదం పునాదిగాగల మిఛూరిన్ జీవ శాస్త్రం అధునాతమైన, అభ్యుదయకరమైన జీవశాస్త్రమైనది. "మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీయొక్క జీవితతత్వశాస్త్రమే గతితార్కిక భౌతికవాదం. ప్రకృతిలో జరిగే ఘటనలను చూసే దృష్టికోణం, ఆ ఘటనలను పరిశీలించే విధానం, ఆ ఘటనలగూర్చి ఆలోచించే మార్గం గతితార్కికమైన ప్రకృతిలో జరిగే ఘటనలకు యిది చెప్పే అర్థం. ఈ ఘటనల యెడ యిది కల్గివున్న దృక్పథం, దాని సిద్ధాంతం భౌతికమైనవి. కనుక యిది గతితార్కిక భౌతికవాదం" అని కామ్రేడ్ స్టాలిన్ నిర్వచించాడు. అభివృద్ధినిరోధక భావవాదప్రపూరిత జీవశాస్త్ర సిద్ధాంతాలకు వ్యతిరేకంగా సాగే సంఘర్షణలో గతితార్కిక భౌతికవాదం లైసెంకో నివేదికలో చక్కగా అనువర్తించబడినట్లుమనకుద్యోతకమవుతోంది. జీవప్రపంచ పరిణామ సూత్రాలను అర్థం చేసుకోటానికి, దానినికూడా మార్చేందుకు అపారంగా తోడ్పడిందని రుజువు అవుతోంది.

మిఛూరిన్ జీవశాస్త్రం, గతితార్కిక భౌతికవాదంయొక్క ప్రధాన సూత్రాలతో ప్రారంభమైంది. కనుక ఇది శరీర నిర్మాణం, పరిణామం జీవిత పరిస్థితులను బట్టి మారుతుందని ఉద్ఘాటిస్తోంది. వారసత్వ గుణాలలో జీవిత పరిస్థితులు మారినప్పుడు - మార్పు తథ్యమని వక్కాణిస్తోంది. కనుక కొత్తగుణాలు, లక్షణాలు తప్పనిసరిగా శరీర నిర్మాణంలో ప్రవేశిస్తాయి అని చెప్పుతోంది. ఈ విధంగా కొత్తగాప్రవేశించిన లక్షణాలు, గుణాలు తిరిగి వారసత్వరూపంలోకి మారుతాయి. వీస్మాన్ - మోరగాన్‌వాదం చెప్పే సిద్ధాంతాన్ని - వారసత్వగుణాలు వృక్ష జంతువుల జీవిత పరిస్థితులకు అతీతంగా వుంటాయి - అనే వాదాన్ని గతతార్కిక భౌతికవాదం పూర్తిగా ఖండిస్తుంది. శరీర నిర్మాణంలో వారసత్వం అనే ప్రత్యేక పదార్థం వుంటుందని భౌతికవాదం అంగీకరించదు. శరీర నిర్మాణం నిండా వారసత్వ గుణాలు వుండనే ఉంటాయి. అయితే జీవిత పరిస్థితులలోవచ్చిన మార్పుల ఫలితంగా శరీర నిర్మాణంలోకూడ మార్పులు వస్తాయి. ఈ మార్పులవల్లనే కొత్తగుణాలు లక్షణాలు కలుగుతాయి. అంటే అర్థం వారసత్వాల్లో మార్పన్న

ఘాటం. కనుక శరీర నిర్మా ణానికి, జీవిత పరిస్థితులకు అవినా భావ సంబంధం వుంటుంది. ఈ రెండూ కలిసి ఒక యూ ని ట్ అవుతుంది.

శరీర నిర్మాణం జరుగుతుంది. జీవిత పరిస్థితులు పదార్థానికి ప్రాతినిధ్యం వహి స్తాయి. పదార్థంలో వచ్చిన మార్పు రూపంలోకూడా బహిర్గత మవుతుంది. ఇచట మొత్తం గుణంగా మారుతుంది. ఈ మార్పిడిఅనిర్ణీతంగా (ఇర్రెగ్యులర్ గా) జరుగుతూవుంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే పాత వారసత్వం పటాపంచ లవుతుంది. వారసత్వపు కొత్తగుణాలు కనపడుతాయి. జీవితంలో వచ్చిన మార్పుల పర్యవసానంగా వృక్షశరీర నిర్మాణంలో మార్పురావటం తప్పనిసరి అవుతుంది. అందువల్ల పరిణామాన్ని మార్చటంవల్ల వారసత్వపు మూలంలోనే మార్పు వస్తోంది. మారిన పరిస్థితులకు అనుగుణంగా తమ శరీరాన్ని మార్చుకో లేనటునంటివి నశించిపోతాయి. వాటి సంతానం మిగలదు. అని లైసెంకో తన నివేదికలో వివరించాడు.

మిఛూరిన్ జీవశాస్త్రానికి అత్యంత బలవత్తరమైన విషయాలు యివి. దీని ప్రభావం, సిద్ధాంతానికి ఆచరణకుగల అవినాభవ సంబంధం, ఆ చ ర ణ లో సిద్ధాంతీకరించిన సూత్రాలను తిరిగి ఆచర ణలోపెట్టి వృద్ధిచేయటం.

మిఛూరిన్ విగ్రహం క్రింది భాగంలో అతని యీ క్రింది ప్రఖ్యాత ప్రవచనం చెక్కబడి వుంది. "ప్రకృతికి మిన్నగా మానవుడు మంచి రకములైన వృక్షాలను సృష్టించగలడు. సృష్టించాలి."

మిఛూరిన్ సిద్ధాంత సూత్రా లను వివరిస్తూ లైసెంకో యీ విధంగా చెప్పాడు. "ఆచరణలో మనలను ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించడం జీవప్రపంచ పరి ణామసూత్రాలనుఅవగాహన చేసు కోవటానికి సక్రమమైనమార్గం". మి ఛూ రి న్ జీవశాస్త్రంయొక్క ఈ సూత్రాలు డార్విన్సూత్రాలనుంచి నూత నంగా ఉద్భవించాయి.

మిఛూరిన్ వాదులు డార్విన్ సిద్ధాం తాన్ని ఆధారంచేసుకొని పరిశోధనప్రారం భిస్తారు. కాని సోషలిస్టు వ్యవసాయంలో వచ్చిన సమస్యలను పరిష్కరించటానికి ఒక్క డార్విన్ సిద్ధాంతమే సరిపోదు. డార్వినిజం ప్రధానంగా శరీరనిర్మాణానికి సంబంధించిన శాస్త్రచరిత్ర. మిఛూరిన్ జీవశాస్త్రం డార్వినిజంయొక్క పైమెట్టు. ఈశాస్త్రంయొక్క పరమాశయం ప్రపం చాన్ని మానవోపయోగాల కనుగుణంగా విప్లవకర మార్గాలలో మార్పుచేయటం. ఈవిషయంలో లైసెంకో ఇలా అన్నాడు.

"డార్విన్సిద్ధాంతంలోని లోపా లను తొలగించటము మాత్రమే గాక ఆ సిద్ధాంతాన్ని మ రిం త ఉన్నతస్థాయిలోకి తీసుకుపోవటం జరిగింది. దాని సూత్రాలలో కొన్ని మార్పులుకూడా చేయ బడ్డాయి. శరీర నిర్మాణాన్నిగూర్చి

పాత చరిత్రను వివరించే విజ్ఞాన శాస్త్రం అవటవల్ల డార్వినియన్ సిద్ధాంతం సృజనాత్మకమైంది. ఆచరణ దృష్ట్యా ఆలోచించి నప్పుడు జీవకోటి శరీర నిర్మాణాన్ని అవగాహన చేసుకొనేందుకు చక్కటి మార్గాన్ని డార్విన్ సిద్ధాంతం తెలియచేస్తోంది."

## లైసెంకో సిద్ధాంతము

జీవశాస్త్రాన్ని అభివృద్ధి చేయడంలో డార్విన్‌కన్న మిఛూరిన్ మరొక అడుగు ముందుకు వేశాడు. ప్రపంచంలోని అభ్యుదయకర శాస్త్రవేత్తల ఉత్తమ సమిష్టి కృషిని మాత్రమే మిఛూరిన్ సిద్ధాంతం ప్రతిబింబించటం లేదు. ఈ సమిష్టికృషిని మించి ఉన్నతమైన నూతనమైన దశను జీవశాస్త్రంలో అభివృద్ధిచేయడం జరిగింది. అందువలననే మిఛూరిన్ జీవశాస్త్రం ప్రపంచంలో కల్ల అత్యుత్తమైన అభివృద్ధికర జీవశాస్త్రమైంది.

లైసెంకో జరిపిన మహత్తర కృషి మిఛూరిన్ జీవశాస్త్రసిద్ధాంతాన్ని మరింత ఉన్నతస్థాయికి తీసుకుపోయింది. వీస్మాన్, మోరగాన్ వాదులకు వ్యతిరేకంగా జరిగే సంఘర్షణను దాని విశిష్టతను మలినం కాకుండా లైసెంకో కాపాడగలిగాడు. వీస్మాన్ మెండల్, మోరగాన్ అనుయాయులుగా మారిన కొందరు సోవియటు శాస్త్రవేత్తల అసలురంగును బట్టబైలుచేశాడు. సిద్ధాంతరీత్యా మిఛూరిన్ సూత్రాలను అభివృద్ధి చేశాడు. ఆ సూత్రాలను ఆచరణలో ప్రవేశపెట్టి సోషలిస్టు వ్యవసాయానికి అపారంగా తోడ్పడ్డాడు.

లైసెంకో తన శాస్త్రకృషిలో వ్యవసాయానికి సంబంధించిన జీవశాస్త్రం, ఇంకా - అనేకములైన పరిశోధనలవల్ల మిఛూరిన్ జెనిటిక్స్‌కు సంబంధించిన సిద్ధాంత సూత్రాలను తయారు చేసాడు. అధికాహారోత్పత్తికై జరిగిన కృషిలో పొందిన అనుభవాలను ప్రజలకు అర్థమయ్యేభాషలో అందచేశాడు. మొక్కల పెంపకాన్నిగూర్చి పరిశోధించి, ఒక సిద్ధాంతాన్ని సమకూర్చాడు. దీనివల్ల మొక్క యొక్క శరీర నిర్మాణాభివృద్ధిని అర్థము చేసుకోవచ్చు. మనకు అవసరమైనట్లు పరిస్థితులలో మార్పుకలగజేసి, వారసత్వాన్ని మార్చికొత్తరకములైన మొక్కలను తయారుచేసుకోవచ్చు. ఉదాహరణకు వసంతకాలంలో పండే గోధుమను శీతాకాలపు పంటగా మార్చాడు. ఇది సిద్ధాంతరీత్యా, ఆచరణదృష్ట్యా చాలా ప్రాముఖ్యమైనది.

లైసెంకో చూపిన పంటలమార్పిడి అధికాహారోత్పత్తికి చాలా ఉపయోగపడింది. ఈ విధంగా శీతాకాలపుపంటగా మార్చబడిన గోధుమ ఉత్తరధ్రువప్రాంతంలోకూడ పండుతోంది. పైగా అధికంగాకూడా పండుతోంది. ఈసంవత్సరం ఈవిధంగా మార్చబడినపంట 7,000,000 *హెక్టార్లలో పండించబడింది. దక్షిణాఫ్రికాలో వేసవికాలపు బంగాళాదుంప పంట తెగుళ్ళనుండి రక్షించబడి లక్షలాది హెక్టార్లలో పండించబడుతోంది. విత్తనాల విజ్ఞానానికిసంబంధించిన ఉత్తమమైన శాస్త్రవిజ్ఞానాన్ని మనదేశంలో లైసెంకో ఆర్జించి పెట్టాడు. రబ్బరు

ఉత్పత్తికి నూతన మార్గాలు శోధించాడు. వ్యవసాయంలో లైసెంకో ప్రవేశపెట్టిన నూతన పద్ధతులవల్ల మెట్టపంటలధికంగా పండుతున్నాయి. (హెక్టారు అనగా షుమారు రెండెకరాలన్నర)

ఈ విధంగా 1,000,000 హెక్టార్లకు పైగా యీ పంట కొత్తయంత్రాలతో వేయబడ్డది. పత్తిపంట విషయంలో సాధించిన విజయం అన్నిటికంటె ముఖ్యమైనది. పత్తిమొక్కలకు కొన్ని రక్షణలను ఏర్పాటుచేయటం ద్వారా అధికంగా ఉత్పత్తి చేయగల్గుతున్నారు. చలి ప్రదేశములలోకూడ ఉత్తమరకమైన పత్తిని పండిస్తున్నారు. ఈరకంగా నూటికి 70 పాళ్ళు పత్తిపంటలో మార్పు తెచ్చారు.

లైసెంకోసాధించిన శాస్త్ర విజయాలు యింకా చాలావున్నాయి. ఇతని పరిశోధనవల్ల సాధించిన విజయాలు సోషలిస్టు వ్యవసాయంలో ఆచరణరూపము పొందాయి. మిచూరిన్ ఉపదేశాలు మహత్తరశక్తిగలవని రుజువు చేయటానికి యింతకన్నా వేరే నిదర్శనం కావాలా ?

మిచూరిన్ విజ్ఞానశాస్త్రం సాధించిన ఘన విజయాలనుగూర్చి యీ మహాసభ ఎంతో కొనియాడింది. వీటిని వివరిస్తూ అనేకమంది మిచూరియన్ శాస్త్రివేత్తలు మాట్లాడారు.

అల్ యూనియన్ యిన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్లాంట్ కల్చర్ కృషిని విజ్ఞానవేత్త ఈటిఫీల్డు ప్రస్తావించాడు. వీస్మాన్ మోరగాన్‌వాదులు కొంతకాలంఈసంస్థపై పెత్తనం సాగిస్తూ దీని కృషిని పూర్తిగా స్థభింపచేశారు. సృజనాత్మక కృషికి స్వస్తిచెప్పారు. మిచూరిన్ ఉపదేశాలను ఆధారం చేసుకొని సమిష్టి శాస్త్రి పరిశోధనలు ప్రారంభిచగానే మహత్తర విజయాలను యీ సంస్థ సాధించగల్గింది.

"ప్రపంచంలోని వివిధ రకాల (విత్తనాల)ను గురించి మనం అవలంబించిన నూతన వైఖరి ఆచరణలో మనకెంతో లభించింది. అతిభయానకమైన యుద్ధకాలంలోనే 170 కొత్తరకపు విత్తనాలను యీ సంస్థ తయారుచేయగల్గిందంటేదాని ప్రాముఖ్యతెట్టిదో అర్ధమౌతుంది. 1941 సంవత్సరాంతానికి యీ సంఖ్య 200వరకూ పెరుగుతుంది." ఈ సంస్థ సహాయంతో యూరల్ పర్వత ప్రాంతాలను పరిశ్రమలకోసం ఆహార నిధులు గాకూడా మార్చడమయింది. ఈ సంస్థ సాగించిన శాస్త్రి పరిశోధనలవల్లనే సోవియట్ వ్యవసాయం, ఉత్తర ధృవ ప్రాంతాలలో ఎడారిప్రాంతాలలో సాగు చేయబడుతోంది.

వీస్మాన్, మోరగాన్ అనుయాయులైన స్కామల్ హాసెన్, డ్యూబనిన్ మొదలగువారు మొక్కలను సంకీర్ణంచేసి పెంచటాన్ని పూర్తిగా తిరస్కరించారు. కాని ఎందుకు సహకారం చేయకూడదో కారణాలను మాత్రం చెప్పారుకాదు. ఏమైనప్పటికీ మిచూరిన్ ఈ విధంగా సంకీర్ణం చేయుటద్వారా 300 రకాల కొత్త పళ్ళనూ, ధాన్యాల పంటలను, సృష్టించగల్గాడు. ఈ సిద్ధాంతాన్ని ఆధారంగా తీసుకొని పెంచిన తోటలు దేశం దశదిశల వర్ధిల్లుతున్నాయి. యాపిల్ పియర్ ఈ రెండు రకములైన చెట్లను సంకీర్ణం చేయగా వచ్చిన జాతిచెట్లు యీనాడు సోవియట్ రష్యా అంతటా 19 ప్రాంతాలలో పెరుగుతున్నాయని ఇసయేవ్ చెప్పాడు.

యాకోవ్‌లెవ్ తన ఉపన్యాసంలో యీ విధంగా చెప్పాడు. "లైసెంకో ఆధ్వర్యాన దేశమంతటా పనిచేసే పరిశోధకులు గత పది సంత్సరాలుగా ఉత్తమకృషిని సాగించారు. సంకరజాతిగా తయారుచేయబడ్డ మొక్కలకు, వాటి పూర్వులకు విచిత్రమైన విలక్షణాలు కనపడ్డాయి; ఈ పది సంపత్సరాలకాలంలోను వృక్షాలను సంకీర్ణం చేసీ విజ్ఞానాన్ని 150 సంవత్సరాలపాటు ప్రపంచం అంతా కలిసి యీ విషయములో సాధించిన విజయాలన్నిటిని తలదన్నుతూ సోవియట్ ఒక్కటే సాధించగల్గింది."

సంకీర్ణం చేయటంలోగల ప్రాశస్త్యాన్ని వివరిస్తూ "వీనివల్ల అధికాహారోత్పత్తి విస్తారంగా సాగుతోందని, అధికపంటలు పండుతున్నాయనీ" అవక్యాన్ అన్నాడు. వివిధ భౌగోళిక ప్రాంతాలలో ఈసంకీర్ణ విధానం జయప్రదమైనదని లుక్యానెంకో విశదపర్చాడు. ఎక్కువపంట రాలుతున్న 'నొవోక్రయింకా 83' వ నంబరు గోధుమపంట కెనడాదేశంలో పండే శీతాకాలపు పంటను యుక్రెయినికాతో సంకీర్ణం చేయటంద్వారా సృష్టి అయింది.

ఆలివ్ పంటల విషయంలో మిఛూరిన్ జీవశాస్త్రం సాధించిన విజయాలను వ్యవసాయ శాస్త్రవేత్త మింకెవిచ్ తెలియచేస్తూ అనేక ఉదాహరణలు యిచ్చాడు. 'ఆలివ్ పంటలసంస్థ'చే తయారుచేయబడ్డ ప్రత్యేక విత్తనాలు నూటికి 80 వంతుల ప్రదేశంలో పండుతున్నాయి. ఈ సంస్థచే ఆచరించబడిన సంకీర్ణవిధానం అత్యంత ప్రయోజనకారిగావుంది.

విజ్ఞాన విదుషిఅయిన ఉషకోవా మోరగాన్, మెండల్, అనుయాయులను తీవ్రముగా విమర్శించింది. సోవియట్ తత్వశాస్త్రవేత్తలు వీరి తప్పుడు అభిప్రాయాలను యింతకాలంగా కొనసాగనివ్వడం ఆశ్చర్యకరమైన విషయమనీ, మోరగాన్, మెండల్ అనుయాయులు ఎప్పుడూకూడ కొత్తరకమైన వీటిని కనిపెట్టటానికి ప్రయత్నించనేలేదనీ ఆమె అన్నది. ఇక తను గిబోవ్ సెలెక్షన్ స్టేషన్‌లో కృషిచేసి కనిపెట్టిన కొత్తవిషయాలు వివరించింది. కొత్తటొమాటోలు, పెప్పర్, చెరకు విత్తనాలను కనిపెట్టగల్గామని చెప్పింది. మస్క్‌మిలన్, వాటర్‌మిలన్ పంటలు విస్తారంగా మాస్కోప్రాంతంలో పండిస్తున్నామని తెలియచేసింది.

శీతకాలపు గోధుమపంట విత్తనాలను సైబిరియాలో నాటడం మూలాన సత్ఫలితాలు కల్గుతున్నవని పంటల శాస్త్రనిపుణుడు వోపకోస్ తెలియజేశాడు. సైబిరియన్ వాతావరణ పరిస్థితినిబట్టి అచట గోధుమపంటను తరతరాలనుండి పండించలేక పోయాం. ఇచట పంటలు ఎందుకు పండటంలేదో తెలుసుకోగల్గిన మొట్టమొదటవ్యక్తి లైసెంకో. శీతకాలపు మంచువల్ల భూమి అతుగుపార దెబ్బతిని గోధుమపంట క్షీణించింది. పైరు పైభాగం కూడా మంచువల్ల చెడిపోతోందని లైసెంకో గుర్తించాడు. సైబీరియాలోని ఏటవాలు ప్రదేశాలల్లో దున్నకుండా గోధుమ విత్తనాలు చల్లితే అక్కడ మంచు తక్కువగా వుంటుంది. కనుక పంటపండుతుందనీ, దానికి కొన్ని జాగ్రత్తలను తీసుకోవాలనీ చెప్పాడు.

"మా సంస్థ ఆరుసంవత్సరాలుగా శీతాకాలపు పంటను వేస్తోంది. యిప్పుడు యీ పంట అపరమితంగా పండుతోందని" వైనకోస్ తెలియజేస్తున్నాడు. ఇవ్వటి అనుభవాలను తీసుకొని యితర ప్రాంతాలలో కూడ యీ విధమైన పంటను పండించబోతున్నామనికూడా చెప్పాడు.

విత్తనాలకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని అరికట్టిన మోరగాన్, వీస్మాన్ అనుయాయులను డోల్‌గుషిన్ తీవ్రంగా నిరసించాడు. ఇతను చెట్టుగా పెరిగే గోధుమనుగూర్చి చెప్పిన విషయం గమనించతగింది. మామూలు గోధుమ అన్ని పరిస్థితులు అనువుగావుంటే సంవత్సరానికి రెండు గ్రాముల గోధుమలను యిస్తోంది. కాని చెట్టుగా పెరిగే గోధుమ మొక్క సంవత్సరానికి పది గ్రాములగోధుమలను ఉత్పత్తి చేస్తోందనీ చెప్పాడాట. చక్కటి వ్యవసాయ యంత్రపరికరాలతో చెట్టుగా పెరిగే గోధుమ పంటను సాగు చేస్తే హెక్టార్ కు 80 నుంచి 100 సెంటెనర్ల వరకు (సెంటెనర్ అంటే 110.23 పౌన్లు.) పండుతుందని తెలియచేశాడు. "విత్తనాలకు సంబంధించిన విజ్ఞాన విషయంలో మనం నూతన యుగంలో అడుగిడుతున్నామని చెప్పితే అతిశయోక్తికాదనుకొంటాను"అన్నాడు వోల్‌గుషిన్.

పంటలను ఎప్పటికప్పుడు మార్చుతూ సోషలిస్టు వ్యవసాయంలో అధికపంట పండిస్తున్నారు. ఈ విధానంవల్ల సోషలిస్టు వ్యవసాయం సర్వతోముఖంగా అభివృద్ధి చెందుతోంది. చక్కటి సూత్రాలతో సాగించే వ్యవసాయంవల్ల అమూల్యమైన లాభాలను పొందుతున్నట్లు ఖురోష్టిలోవ్ తెలియచేశాడు. 1946 లో రోస్టోవ్ ప్రాంతంల్లో మంచు అపారంగా కురిసింది. అయినప్పటికి ఆ సంవత్సరం అచ్చట హెక్టర్ కు 14 సెంటెనర్ల పంటను పండించారని తెలియచేశాడు. 1947 లో యీప్రాంతంలో పరిస్థితి మరింతఅధ్వాన్నమయింది. అయినప్పటికి హెక్టర్ ఒకటికి 16 . 2 సెంటెనర్ల పంట పండించారు. స్టాలిన్ వ్యవసాయక్షేత్రం ఇందులోప్రసిద్ధి పొందింది. సామాన్యంగా సాష్క్స్ జిల్లాలో మనిషి ఒక్కంటికి 39 సెంటెనర్ల పంటను పండిస్తారు. కాని స్టాలిన్ వ్యవసాయక్షేత్రంలో మనిషి ఒక్కంటికి 57 సెంటెనర్ల పంటను పండించారు. అంటే 4470 రూబుల్స్ సాలీనా వచ్చే ఆదాయం 1656 రూబుల్సుకు పెరిగిందన్నమాట. మామూలుగా పెంచే ఆవులు సాలీనా యిచ్చే పాలు 1297 వాటర్ల నుండి 1857 వాటర్లకు పెరిగింది, డుకుట్చ్ కోవ్ - ఎలియిమ్స్ సూత్రాలను ఆచరణలో పెట్టడంమూలాన వ్యవసాయ క్షేత్రాల్లో పని చేసే రైతుస్థితి బాగు పడింది.

సోషలిస్టు వ్యవసాయం పూర్తిగా యంత్రాలతో చేయబడే వ్యవసాయం. వాసిలెంకో ఉపన్యాసం యీవిషయంలో చాలా ప్రధానమైంది. వ్యవసాయ జీవ శాస్త్రి విషయంలో మిఛూరిన్ శాస్త్రానికి యంత్రశాస్త్రానికి పటుతరమైన సంబంధ బాంధవ్యంవుందని వాసిలెంకో తెలియచేస్తున్నాడు. మిఛూరిన్ వ్యవసాయక జీవశాస్త్రాన్ని ఆచరణలో పెట్టుటకు అవుసరమైన యంత్రపరికరాలను సోవియట్ శాస్త్రివేత్తలు కనిపెట్టారు. ఈ యంత్రాల సాయంతో వ్యవసాయ శాఖలో పనిచేసే శాస్త్రివేత్తలు భూమిని ఒక నిర్ణీతమైన విధానంలో సారవంతంగా మార్చారు. ప్రకృతిపై అధికారం వహించి మానవాభ్యుదయంకోసం కృషి చేస్తు

న్నారు. "మన కర్మాగారాలు తయారు చేసే గుర్రపునాగళ్ళు దుక్కికి, చక్కగా ఉపయోగిస్తున్నాయి. కాని అమెరికాలో పరిస్థితిదీనికి పూర్తిగా భిన్నంగా వున్నదని" వాసిలెంకోఅన్నాడు.అమెరికాలో వ్యవసాయక ఆర్థిక వ్యవస్థకు జీవశాస్త్రానికి ఎట్టిసంబంధం వుండదు. గుర్రపునాగళ్ళను అచట ఉపయోగించరు. మామూలుసందర్భంలో అచట విరివిగా యంత్రాలను ఉపయోగిస్తారు. దానివల్ల ధాన్యం మాత్రం నూర్చి, మిగతా గడ్డిని యంత్ర సాయంతో పొలంలోనే విరజిమ్ముతారు. దీనివల్ల గడ్డితోపాటు కలుపు మొక్కల విత్తనాలుకూడా పొలంలో అధికంగా పడతాయి. బీదపొలాన్నికూడా లోతుగా దున్నుతారు. ఈ కారణాలవల్ల అమెరికా దేశం నిస్సారంగా మారే దేశాలలో ఒకటిగా తయారవుతోంది.

"మిఛూరియన్ జీవశాస్త్రి విజయాలు మనకు పశుపెంపకంలోకూడా కనపడతాయి. మన జంతు సిద్ధాంతాలుకూడా ఈ నిర్ణీత రీతిలోనే నడవాలి. కావలసినగుణంగల పశువులను తగినంత ఎక్కువగా సంపాదించుకోవాలి. ఇది యీ క్రింది సూత్రానికి అనువైనదిగా వుండాలి. వాతావరణ పరిస్థితులను బట్టి, అక్కడ లభ్యమయ్యే ఆహారాన్ని బట్టి, వాటి పెంపకానికి కావలసిన అవసరాలనుబట్టి ఉత్తమ జాతికి చెందిన పశువులను ఏరుకొని పెంచాలి. మరోప్రక్క ఆ రకమైన పశువులమనుగడకు కావలసిన ఆహారాన్ని,అవసరాలను ఎప్పటికప్పుడు సృష్టిస్తూ వుండాలి. కొత్త రకాలను ఏరుకోవటం, వాటి పెంపకం రెండూవిడదీయడానికివీలు లేనట్టివి. అన్నాడు లైసెంకో. స్టేట్ పశు పెంపకశాలా డైరెక్టర్ పామ్యన్ ఈ విషయంలో మరికొన్ని ఈ వివరాలు పేర్కొన్నాడు. కొత్తరకమైన పశుసంపదను అభివృద్ధిచేసినట్లు తెలియజేశాడు. ఈ రకపు ఉత్తమ పశుజాతిపేరు కాస్ట్రోమా. ఈ రకానికి చెందిన ఆవులు సాలీనా 4800 నుండి 6300కిలోగ్రాముల పాలు ఒక్కొక్క ఆవు యిస్తోంది. 10,000 నుండి 14000 కిలోగ్రాముల పాలను సాలీనా యిచ్చే ఆవులు డజన్లకొలది కలవని పేర్కొన్నాడు."

"శాశ్వత వారసత్వ లక్షణాలు, ప్రవృత్తుల సూత్రాలంటూ లేవనే విషయాన్ని యీ కొన్ని సంవత్సరాల మా అనుభం తెలియజేస్తుంది." అన్నాడు పామ్యన్.

మాంసం మొదలైన జీవితావసర వస్తువులను అందజేసే గొర్రెలు, మేకలు మొదలైన వాటినికూడా మంచి రకములను తయారు చేస్తున్నారు. విదేశాలలోకన్న రష్యాలో గొర్రె ఒక్కంటికి ఎక్కువ మాంసం లభ్యమవుతోంది. మంచిరకమైన గొర్రెలనుంచి సున్నితమైన ఉన్ని తయారుచేస్తున్నారు. ఈవిధంగా జీవితావసరములైన గొర్రెలు మొదలగునవి అభ్యుదయకర మిఛూరిన్ జీవశాస్త్రి పద్ధతులపై అభివృద్ధిచేయబడుతున్నాయి. రెండోప్రక్క వీస్మాన్, మోరగాన్ అనుయాయులైన సెరెబోవ్రగేకోస్కీ, ఖైడ్చోవటిస్కీ యిత్యాదుల ఆధ్వర్యాన యీ రంగంలో పురోభివృద్ధి అరికట్టబడి,

తద్వారా దేశసంపద నాశనం చేయబడుతోంది.

అభివృద్ధినిరోధక వీస్మాన్ జీవశాస్త్రవేత్తలు వీస్మాన్‌వాదాన్ని, మోరగాన్‌వాదాన్ని సమర్థించటంలో వెలకిలబడ్డారు. సిద్ధాంతదారిద్ర్యం, ఆచరణశూన్యం అయిన తమ వాదాన్ని హేతువాదరీత్యా సమర్థించుకోలేకపోయారు. తమ నిత్యానుభవంలోంచి ఒక్క విజయాన్నికూడా ఎత్తి చూపలేకపోయారు.

వీస్మాన్ - మోరగాన్‌వాదులను మన దేశంలో నాయకత్వం వహించే స్కాల్మ్‌హాసెన్ తాను మిచూరిన్ అనుయాయుణ్ణి అని చెప్పుకున్నాడు. కాని 'పరిణామ కారణాలు' అన్న తన పుస్తకంలో వీస్మాన్, మోరగాన్‌వాద సూత్రాలను సమర్థించాడు. వాటినే ఆచరణలో తన శాస్త్రకృషికి ప్రధానంగా స్వీకరించాడు. అవిఖాన్‌యావ్ తన ఉపన్యాసంలో వీస్మాన్‌యొక్క 'వారసత్వ' సిద్ధాంతం ఆధ్యాత్మికమైనదికాదని, మిచూరిన్ సిద్ధాంతానికి, వీస్మాన్ సిద్ధాంతానికిమధ్య వైరుధ్యం లేదని సెలవిచ్చాడు. జవదవస్కీ ఊకదంపుడు ఉపన్యాసం యొక్క సారాంశం అంతా యిదే!

"మెండలియన్ జెనటిక్స్‌ను సోవియట్ శాస్త్రరంగంనుంచిమనంత్రోసివేయరాదు. మిచూరిన్ జీవశాస్త్రం ఒక్కటే మిగతా వాటిని త్రోసిరాజని మన ఆశయాన్ని సాధించలేదు. మిచూరిన్ శాస్త్రంతోపాటు యితర శాస్త్రాలను కూడ మనం ఉపయోగించుకోవాలి." అని లైసెంకో శాస్త్రకృషి మిచూరిన్ శాస్త్రానికి విరుద్ధమైనదని రుజువు చేయటానికి చాలా తంటాలు పడ్డాడు. జవడవస్కీ వాదం చివరకు చిలకపలుకలకింద తేలింది. ఏ శాస్త్రవేత్తా యిట్టి చిలకపలుకులను అంగీకరించలేదు. శాస్త్రవేత్త నెమిట్చికోవ్ వీస్మాన్, మోరగాన్‌వాదాన్ని పూర్తిగా సమర్థించాడు. ప్రత్యేకంగా రష్యాలోని వారి అనుయాయులను నెత్తినెట్టుకొని పూజిస్తూ మాట్లాడాడు. తన స్థితిని తెలియజేస్తూ. తనంతటతానే అభాసుపాలయ్యాడు. "వారసత్వ సిద్ధాంతం మానవజాతి సాధించిన విజ్ఞాన నిధిలో ఆణిముత్యం వంటిది" ఇది అనేక వాటివల్ల రుజువుచేయబడిందని బుకాయించి కూర్చున్నాడు. శాస్త్రవేత్తలు మిటిన్, ప్రెజెంట్, మిచినోవ్, స్టోవెటోవ్ మొదలయినవారు వీస్మాన్ మోరగాన్ అనుయాయులను తూర్పారబట్టారు. మిటిన్ మాట్లాడుతూ స్కాల్మ్‌హాసెన్ మొదలైన వీస్మాన్ అనుయాయులను తీవ్రంగా విమర్శించాడు 1931 ప్రాంతంలోనే తత్వశాస్త్రంలోనూ, ప్రకృతి శాస్త్రంలోనూ ప్రవేశిస్తున్న మెన్షివిక్ భావవాదాన్ని పార్టీ విమర్శించిందని గుర్తు చేశాడు. మిచూరిన్‌నుగూర్చి ప్రస్తావిస్తూ విజ్ఞానశాస్త్రంలో దేశభక్తి స్థానాన్ని గూర్చి మిటిన్ యిలా ఉద్ఘాటించాడు.

"సోవియట్ శాస్త్రవేత్త మిచూరిన్‌ను గూర్చి మనం ఎంతెంతిగానైనా గర్వపడవచ్చు. దేహనిర్మాణంయొక్క పరిణామ సూత్రాలను అతను శాస్త్రీయమైన దృష్టిలో పూర్తిగా అర్థంచేసుకోగల్గాడు. విజ్ఞాన శాస్త్రంలో హెచ్చుతగ్గులు చూపాల్సిన అవుసరం లేదని విజ్ఞానశాస్త్రాన్ని గూర్చి 'విశాల దృక్పథముకలవారు' బుకాయిస్తూ వుంటారు. ఏమైనప్పటికి జీవశాస్త్ర విషయంలో మిచూరిన్ సాధించిన మహత్తర విజయాలను గూర్చి సోవియట్ ప్రజ గర్వించటంలో తప్పులేదు."

శాస్త్రవేత్త ప్రెజెంట్ అభ్యుదయకర భౌతికవాద జీవశాస్త్రానికి, అభివృద్ధి నిరో

ధక భావవాద జీవితశాస్త్రానికి మధ్య తరతరాలబడి సాగుతున్న సిద్ధాంత సంఘర్షణ చరిత్రను విపులీకరించాడు. జవడవస్కీ, అంచూన్‌యన్ ప్రబుద్ధులు మిఛూరిన్ జీవశాస్త్రాన్ని, మెండల్, మోరగాన్ శాస్త్రంలో మూసపోయటానికిప్రయత్నించారనీ, తద్వారా రెండు విరుద్ధశాస్త్రాలను మిళితంచేయ ప్రయత్నించారనీ విమర్శించాడు. మిఛూరిన్ ఆదర్శాలను యీ విధంగా కళంకముచేసేయత్నం పూర్తిగా వమ్మైపోయిందన్నాడు. సంకీర్ణం చేయటంద్వారా వృక్షాలను పెంచలేమని జుకోల్‌స్కీ డబాయించడాన్ని ప్రెజెంట్ విమర్శించాడు. మహాసభ ఆవరణలోనే సంకీర్ణము చేయడంద్వారా వృక్షాలను మిఛూరిన్ ప్రయోగరూపంతో చేసిచూపెట్టారు. ఇంతకన్నా దాన్ని వ్యతిరేకించేవారికి చెంపదెబ్బ వేరేకావాలా? సిద్ధాంత దారిద్ర్యము ప్రాప్తించిన మోరగాన్‌వాదం ఆచరణలో పప్పులోకాలేసింది. దానిని గూర్చి ప్రస్తావిస్తూ ప్రెజెంట్ యిలా ఉద్ఘాటించాడు.

"నేటి డార్విన్ వాదానికి, డార్విన్‌నాటి డార్విన్ వాదానికి ఎక్కడా పోలిక లేదు. మిఛూరిన్ సిద్ధాంతం ప్రకారం డార్విన్ చెప్పినట్లుగా "ది లా అఫ్ సెలెక్షన్" నిర్వచించబడలేదు. ఈ సూత్రానికి వాతావరణ పరిస్థితుల ప్రభావముకూడా జోడించబడాలి. మనం మిఛూరిన్ చెప్పిన విధంగా కొన్ని వాతావరణ పరిస్థితులను సృష్టించి తదనుగుణంగా కొన్ని వృక్షాలలో మార్పు కృత్రకపద్ధతులలో తీసుకురాగలం. ఇంత ఉన్నతమైన శాస్త్రస్థాయిని డార్విన్‌శాస్త్రము అందుకోలేదు."

మోరగాన్, మెండల్‌వాదులను విమర్శిస్తూ, వారు ఆచరణకు దూరమైపోయారని స్టోలెటోవ్ చెప్పాడు. మోరగాన్, మెండల్ అనుయాయులు మానవజాతిని మహోన్నత పథానికి తమ శాస్త్రపరిశోధనలు తీసుకుపోతాయని తియ్యని వాగ్దానాలు చేస్తున్నప్పటికీ, వారంతా వట్టి మేడిపండు వృక్షాలని చెప్తూ యిలా అన్నాడు:

"లైసెంకోయొక్క, యితర మిఛూరిన్ వాదులయొక్క పరిశోధనలకు ఏ యితర పరిశోధనకూడా ఆచరణలో ఏవిధంగానూ సరితూగదు. ఈ విధంగా మిచూరిన్‌శాస్త్రం పటిష్ఠతను, బలిమిని ఆర్జించుకొంటోంది.

ఉన్నతాదర్శానికి పాత భావాలు, అగర్భశత్రువులాంటివి. ఉన్నతాదర్శంతో కూడుకున్న మిచూరిన్‌శాస్త్రం సోవియట్ భూమిలోవేరు తన్నుకొంటోంది. "శుద్ధమేధావితత్వం" మానవాతీత సిద్ధాంతము, మోరగాన్‌వాదుల సిద్ధాంత దారిద్ర్యము మనదేశంలో యిట్టే బయటపడిపోతున్నాయి. కనుక మోరగాన్‌వాదం దానంతటదే నశించిపోతోంది. పాత భావాలనుంచి వారిని విముక్తిగావించే ఒక ఉన్నతాదర్శం వారిని స్వీకరించదు, కాని గాలిలో సాముచేయటం అంటే వానికి మహాప్రీతి. అందువల్ల వారు యింకా రోజురోజుకూ పాతభావాల ఊబిలోకి దిగజారిపోతారు.

హెర్జెక్ చెప్పినట్లు విజ్ఞానశాస్త్రం సత్యాన్వేషణకు చక్కటి రుజుమార్గం. సోవియట్ విజ్ఞానశాస్త్రం ప్రజలప సంబం

ధించిన ఒక ముఖ్యాంశం. ఇట్టి ముఖ్యమైన ఆరోగ్యకరమైన అంగనిర్మాణంలో వీస్మాన్ వాదుల అభివృద్ధినిరోధక, "విషక్రిములు ప్రవేశించలేవు. సోవియట్ శాస్త్రం ఈ క్రిములనుండి విముక్తిపొంది నిర్విఘ్నంగా నిర్విరామంగా ముందుకు సాగిపోతుంది.

దానికి ప్రత్యక్ష నిదర్శం అమరజీవి లెనిన్ పేరిట నేడు జరుగుతున్న మహాసభ. దీనికి మహానాయకుడు స్టాలిన్ యొక్క సంపూర్ణసహకారం ఉంది.

మహాసభానంతరం జుకోవస్కీ, అవిఖాన్యాన్, పోల్యకోవ్‌లు మిఛూరిన్ జీవశాస్త్రి విజయాలను అంగీకరించి, తమ తప్పుడు భావాలను విసర్జించి, అభివృద్ధికర మిఛూరిన్ జీవశాస్త్రాన్ని అంగీకరించి యిక ముందు పనిచేస్తామని ప్రకటన చేశారు. ఇకముందు ఆచరణలో వారి ప్రకటనల నిజాయితీ రుజువు కాగలదు.

సోషలిస్టు వ్యవసాయంలో మిఛూరిన్ జీవశాస్త్రం అమలు జరుపబడిందన్న విషయము అనేకమంది ఉపన్యాసాలద్వారా నిరూపితమైంది. ఈ శాస్త్రం సోషలిస్టు వ్యవసాయంతో సన్నిహిత మిత్రత్వం సాధించింది. ఈ మేలుకలయికద్వారా మన వ్యవసాయం మహోన్నత శిఖరాల నందుకొంటోంది. పెట్టుబడిదారీ దేశాల లోని వ్యవసాయాన్ని వెక్కిరిస్తూ ముందుకు పోతూంది. ప్రపంచములో సోవియట్ భూమిని సకల సంపన్న దేశంగా, సస్యశ్యామలంగా మార్చడంలో మిఛూరిన్ జీవశాస్త్రం సోవియట్ ప్రజల చేతిలో ఒక శక్తివంతమైన ఆయుధంగా ఉపయోగిస్తోంది.

లైసెంకో తన ముగింపు ఉపన్యాసంలో యిలా తెలియచేశాడు.

"నా ఈ నివేదికనుగురించి పార్టీ సెంట్రల్ కమిటీ వైఖరి ఏమిటో తెలియచేయుమని నాకు ఒక చీటీ పంపారు. దానికి నా సమాధానం యిది. "నా నివేదికను సెంట్రల్ కమిటీ పరిశీలించి ఆమోదించింది."

ఈ ప్రకటన మహాసభలో అమితమైన హర్షధ్వానులకు దారితీసింది. అమితోత్సాహంతో అంతా నిలబడి విజ్ఞానశాస్త్రానికి గొప్ప మిత్రుడు, సోవియట్ దేశానికి అధినేత, కామ్రేడ్ స్టాలిన్‌కు అభివందన పరంపరను అందజేశారు.

మిఛూరిన్‌శాస్త్రం మోరగాన్ మెండల్ శాస్త్రాన్ని పూర్తిగా ఓడించిందనటానికి యీ మహాసభ ప్రబలతార్కాణం. జీవశాస్త్ర పరిణామపు పురోగమనంలో ఈ మహాసభ ఒక చారిత్రాత్మకమైన ఘటన. కామ్రేడు స్టాలినును అభినందిస్తూ మహాసభ యీ విధంగా తీర్మానించింది.

ప్రకృతిని మానవోపయోగం కోసం మార్చిన ఉత్తమ పరిణామకుడు అయిన మిఛూరిన్‌యొక్క అభ్యుదయకర, భౌతికవాద ప్రపూరితమైన జీవశాస్త్రాన్ని మలినం కాకుండా కాపాడి, కామ్రేడ్ లెనిను కృషిని నీవు దిగ్విజయంగా కొనసాగించావు. జీవశాస్త్రరంగంలో ఒక్క మిఛూరిను జీవశాస్త్రమే నిజమైన అభ్యుదయకరమైన విజ్ఞానశాస్త్రమని రుజువుచేసి దాన్ని మహోన్నతపథానికి కొనిపోయావు ఇది మార్క్సిస్టు, లెనినిస్టు శాస్త్రీయ దృక్పథానికి మరింత చేవ కూర్చిపెట్టింది. ఈ చారిత్రక అనుభవమే మార్క్సిస్టు లెనినిస్టు, దృక్పథం యదార్ధమని మరొకసారి రుజువు చేసింది.

ఈ పుస్తకం చివరిభాగంలో మహాసభ నిర్ణయాలు యివ్వబడ్డాయి. యీ నిర్ణయాలలో మిఛూరినుశాస్త్రం భౌతిక వాద ప్రపూరితమైన జీవశాస్త్రానికి కొత్త రూపమని, మరో పైమెట్టని నిర్ణయించడమైంది. భావవాదంతోకూడిన వీస్మాన్ జీవశాస్త్రం తీవ్రంగా ఖండించబడింది. మిఛూరిన్ శాస్త్రాన్ని ముందుకు కొనిపోవటంలో అభేద్యమైన ఐక్యతను ప్రదర్శించవలసిందిగా వ్యవసాయశాస్త్రంలో పని చేసేవారందరికీ ఒక విజ్ఞప్తిచేస్తూ లెనిను-స్టాలిను - పార్టీ ఆధ్వర్యాన ముందంజ వేయమని పిలుపునిచ్చారు. వ్యవసాయములో మనలను ఎదుర్కొనే ప్రతి సమస్యను ఈనూతన సిద్ధాంతం జయప్రదంగా పరిష్కరించగలదని ఎలుగెత్తిచాటారు.

— పొలిటికల్ ఎఫైయిర్స్
(ఫిబ్రవరి 49)

విజ్ఞానశాస్త్రం వికాసం చెందాలంటే! పాత శాస్త్రవేత్తలను, పేరు పొందిన శాస్త్రవేత్తలనూ శాస్త్రరంగంలో ప్రవక్తలరూపంపొందనివ్వరాదు. శాస్త్రంపై గుత్తాధికారులుగా తయారు కానివ్వరాదు. పాత క్రొత్త శాస్త్రవేత్తలను యిద్దరినీ మిళితం చేయటంలో గల ప్రాముఖ్యతను, అవసరాన్ని ప్రత్యేకతను గుర్తించగల్గివుండాలి. శాస్త్రరంగంలో ప్రవేశించటానికి నూతనశక్తులకు పూర్తి స్వేచ్ఛనిచ్చి హృదయపూర్వకంగా ఆహ్వానించాలి. ఈ విధంగా విజ్ఞానశాస్త్రం యొక్క ఉన్నత శిఖరాలను చేరుకోగలం. శాస్త్రరంగంలో భవిష్యత్తు యువకుల సొత్తని ఎలుగెత్తి చాటాలి.

విజ్ఞానశాస్త్రం వికాసం పొందాలంటే! విజ్ఞానశాస్త్రం గతంలో సాధించిన విజయాలను, ప్రాముఖ్యతను, శక్తిని అంగీకరించి, అర్థంచేసుకొని, వీటిని శాస్త్ర వికాసానికి సద్వినియోగం చేసుకుంటూ మరొక ప్రక్క పాత భావాల ప్రభావానికి లోనుకాకుండా గతభావాలూ మార్గాలూ ఉన్నతికీ అభివృద్ధికీ ఆటంకంగా తయారైనప్పుడు వాటిని తుత్తునియలుచేసి వాటిస్థానే క్రొత్తభావాలను కొత్త విలువలను కొత్త మార్గాలను ప్రవేశపెట్టగలిగి ఉండాలి.

— స్టాలిన్

# ప్రపంచశాంతి మహాసభలో

# భారత ప్రజావాణి

[ ఏప్రిల్ 20 వ తేదీన పారిస్ నగరంలో ప్రపంచ శాంతి కాముకల మహాసభ జరిగింది. ఆ మహాసభలో పాల్గొనడానికి ఇండియానుండి డాక్టర్ ముల్కు-రాజ్ ఆనంద్, యింకా యితర అభ్యుదయకళాకారులూ, ప్రఖ్యాత కార్మికనాయకులు వెళ్ళడానికి ప్రయత్నించగా నెహ్రూ ప్రభుత్వం పాస్ పోర్టుల నివ్వ నిరాకరించి వారి నష్టపరచింది. అయినప్పటికీ అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు తరఫున కామ్రేడ్ మహమ్మద్ బక్షి హాజరై ఇండియాకు ప్రాతినిధ్యం వహించగలిగాడు. ఆ మహాసభలో కామ్రేడ్ మహమ్మద్ బక్షి చేసిన ప్రకటన సారాంశాన్ని యీ క్రింద నిస్తున్నాం — సంపాదకవర్గం ]

కామ్రేడ్స్! ప్రపంచ శ్రామిక ప్రజల ప్రతినిధులారా !! భారత కార్మికవర్గం తరఫున, అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు ఆధ్వర్యాన వివిధ పరిశ్రమలలో సంఘటితపడిన 8 లక్షల కార్మి[illegible] తరఫున – యివే మీకు నా హృ[illegible]ర్వ[illegible] [illegible]భి[illegible]నాలు.

ప్రపంచశాంతి మహాసభ చరిత్రలో యి వరకెన్నడూ జరుగనటు[illegible]టి లక్ష లాది ప్రపంచ శ్రామికుల బ్రహ్మాండమైన సమీకరణాయిది. ఈ మహాసభలో శక్తివంతమైన సోషలిస్టు భూమి, మహత్తరమైన సోవియట్ యూనియన్ ప్రతినిధులు ముందు భాగంలో ఆసీనులైవున్నారు. వారి తరువాత చైనా ప్రజల ప్రతినిధులు సభనలంకరించారు. వారి తరువాత వరుసగా బలవత్తరమైన ఫ్రెంచి, ఇటాలియన్ కార్మికోద్యమాల ప్రతినిధులూ, తూర్పు యూరప్ ప్రజారాజ్యాలలోని శ్రామిక ప్రజల ప్రతినిధులూ, అన్ని దేశాలలోని సామాన్యప్రజల ప్రతినిధులూ మనముందు ఆసీనులైవున్నారు. శాంతి, ప్రజాస్వామికము, సోషలిజంలకోసం పోరాడే ప్రపంచ

ప్రజాశక్తుల బ్రహ్మాండమైన, మహోన్నతమైన బలసంపద ఈనాడిక్కడ మన కండ్ల ముందు ప్రత్యక్షమైంది.

**ప్రపంచ ప్రజలపైన సోషలిజానికి దుర్గమైన సోవియట్ యూనియన్‌పై యుద్ధం చేయడానికి అట్లాంటిక్ ఒడంబడికపై సంతకాలు పెట్టిన యుద్ధోన్మాదులందరికీ యీ మహాసభ ఒక సవాలు.**

**భారత కార్మికవర్గం తరఫున యీ మహాసభకు నా అభివందనాలను అందజేస్తూ, యీ శాంతిమహాసభ యిచ్చే ఆదేశాన్ని ఎలాంటి సందేహము లేకుండా భారత కార్మికవర్గం నెరవేర్చుతుందని మీకు హామీనిస్తున్నా.**

అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ప్రతినిధులే స్వయంగా హాజరై భారత కార్మికవర్గం తరఫున యిక్కడ సమావేశమైన ప్రపంచ ప్రజల ప్రతినిధుల యెడల తమ భక్తివిశ్వాసాలు ప్రకటించియుంటే ఎంతో గౌరవ ప్రదంగా ఉండేడిది. కాని నెహ్రూ ప్రభుత్వం వారికి పాస్‌పోర్టులు యివ్వనిరాకరించడం వలన వారు యీ పారిస్ సమావేశానికి రాలేకపోయారు.

ఈ రకమైన నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా మేము పోరాడుతున్నాం. అయితే అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ఒకహామీమాత్రం మీకు ఖచ్చితంగా యివ్వగలదు. ఎంతటి దారుణ నిర్బంధ విధానమైనా శాంతికోసం మా కార్మికవర్గం తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహించి తీరుతుంది. అమెరికా సామ్రాజ్యవాదానికి యుద్ధ కేంద్రంగా మార్చివైచే నెహ్రూ ప్రభుత్వపు ప్రతి ప్రయత్నాన్నీ భారత కార్మికవర్గం ప్రతిఘటించి తీరుతుంది.

ప్రపంచ ప్రజలను మరొక యుద్ధానికి బలిచేయడానికి ఉద్దేశించబడిన అట్లాంటిక్ ఒడంబడికను భారత కార్మికవర్గం తీవ్రంగా ఖండించింది. అన్ని దేశాలలోని శ్రామిక ప్రజలతోపాటు భారత శ్రామిక ప్రజలనుకూడా పెట్టుబడిదారీ దోపిడీ విధానానికి వ్యతిరేకంగా, శాంతి ప్రజాస్వామికం సోషలిజంలకోసం తాము సాగించుతున్న పోరాటంలో సోవియట్ యూనియన్ ఆశను, ఉత్సాహాన్ని యిచ్చింది. అలాంటి మహోన్నతమయిన సోవియట్ యూనియనుకు వ్యతిరేకంగా దురాక్రమణ యుద్ధాన్ని కొనసాగించడాని కీసామ్రాజ్యవాదులూ, పెట్టుబడిదారులూ అట్లాంటిక్ ఒడంబడిక అనే కుట్రను పన్నారు.

## అట్లాంటిక్ ఒడంబడిక అసలు సారాంశం

ప్రపంచం మొత్తంమీద ఆంగ్లో-అమెరికన్‌ల సర్వాధిపత్యాన్ని మిలిటరీ దురాక్రమణద్వారా స్థాపించడానికి సిగ్గువిడచి అట్లాంటిక్ కుట్రను పన్నారు. ఈ ఒడంబడికద్వారా అన్ని దేశాలలోని కార్మికోద్యమాలనూ, ఆసియాలోనూ, యింకా యితర వలసదేశాలలోనూ, ప్రజల విముక్తి ఉద్యమాలనూ సర్వనాశనము చేయడానికి అన్ని దేశాలలోని పెట్టుబడిదారీవర్గాల బలాన్ని సమీకరించ ఉా

లాట పడుతున్నారు. అన్ని దేశాలలోని అభ్యుదయకర ఉద్యమాలపై దాడులను సాగస్తున్నారు. బర్మా, మలయా, వియత్ నామ్, ఇండోనీషియాలలోని ప్రజల విముక్తి ఉద్యమాలను బ్రిటిషు, డచ్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు అతి క్రూరంగా అణచడానికి దారుణమైన దాడులు చేస్తున్నారు. వలసదేశాలుగల ప్రభుత్వాలన్నీ యీ దేశాలను ఆంగ్లో-అమెరికను యుద్ధోన్మాదుల అవసరాలకు వినియోగించేందుకు యీ ఉద్యమాలను అణచబూనుకున్నాయి. ఈ దేశాలన్నింటినీ ప్రపంచ ప్రజలకు, సోవియట్ యూనియనుకూ వ్యతిరేకంగా మిలిటరీ కేంద్రాలుగా మార్చడానికి సిగ్గువిడిచిచేసే ప్రయత్నమే యిదంతా.

ఇదివరకు హిట్లర్ - టోజో - ముసులోనీలు చేసుకొన్న "కామింటరన్ వ్యతిరేక ఒడంబడిక" యొక్క నకలే యీనాటి అట్లాంటిక్ ఒడంబడిక ఉద్దేశ్యం సరిగ్గా కామింటరన్ వ్యతిరేక ఒడంబడిక ఉద్దేశ్యమే దీని సారాంశం. ప్రపంచాన్నంతటినీ అమెరికా సామ్రాజ్యవాదం యొక్క బానిసగా చేయడమే. ఈ ఒడంబడిక ప్రతిదేశం యొక్క స్వాతంత్ర్యానికి ప్రమాదం తెస్తుంది. అన్ని దేశాలలోని విముక్తి ఉద్యమాలకూ యీ ఒడంబడిక ఒక సవాలు. కూలిపోతున్న తమ ఆధిపత్యాన్ని తిరిగి నెలకొల్పుకోనేందుకు ప్రపంచ అభివృద్ధి నిరోధక ముఠా తెగించి చేస్తున్న ఆఖరు ప్రయత్నమిది.

**కాని నేడు ప్రపంచమంతటా సోషలిస్టుశక్తులు చాల బలవత్తరంగా అభివృద్ధిచెందాయి. యుద్ధోన్మాదుల యీ కుట్రలను ప్రజాశక్తులు ఖచ్చితంగా ఓడించగల స్థితిలో ఉన్నాయి. అన్ని దేశాలలోని ప్రజలూ మూడో ప్రపంచ యుద్ధం తీసుకొని రావడానికి ప్రయత్నించుతున్నా తమ దేశాలలోని యుద్ధోన్మాదులఆట కట్టించి తీరుతారు. ఈ యుద్ధోన్మాదులకూ, మూడో ప్రపంచయుద్ధాన్ని తెచ్చిపెట్టే ప్రయత్నాలకూ ప్రపంచమంతటావున్న శ్రామిక ప్రజానీకానికీ ప్రాతినిధ్యం వహించే యీనాడు యిక్కడ సమావేశమవుతున్న ప్రపంచశాంతి మహాసభ ఒకసవాలు. అది వారికి చావుదెబ్బ కొడుతుంది.**

ప్రపంచ శ్రామికప్రజల సంఘటనకు అగ్రగామిగా మహత్తరమైన సోషలిస్టు భూమి సోవియట్ యూనియను నిలబడి ఉంది. తూర్పు యూరప్‌లోని ప్రజాస్వామికరాజ్యాలలోని ప్రజలూ, ఫ్రాన్సు ఇటలీ, తదితర యూరప్‌రాజ్యాలలోని కార్మికవర్గం, ఆసియాఖండంలోని వలస ప్రజల విముక్తి ఉద్యమాలకు అగ్రగామిగా నిలబడిఉన్న చైనా ప్రజలూ - ఇది నేటి బ్రహ్మాండమైన ప్రపంచశ్రామిక ప్రజాసంఘటన. ఈ మహాసంఘటన మూడో ప్రపంచయుద్ధంకోసం ప్లానులు పన్నుతున్న యుద్ధోన్మాదులకు చక్కని జవాబునిస్తుంది.

భారత శ్రామిక ప్రజానీకం, కార్మికవర్గ నాయకత్వాన శాంతి, ప్రజాస్వామికాల, సోషలిజంలకు ఆలవాలమై ప్రపంచ శాంతిశిబిరంలో సైనికులుగాతమస్థానాన్ని

ధృఢంగా స్వీకరించి ప్రపంచ ప్రజలకూ, సోవియట్ యూనియనుకు వ్యతిరేక యుద్ధకేంద్రంగా ఇండియాను మార్చే ప్రయత్నాన్ని ప్రతిఘటించుతారు.

## ఆంగ్లో - అమెరికన్ల అడుగుజాడలలో నెహ్రూ ప్రభుత్వం

భారత పెట్టుబడిదారీ వర్గాలకు ప్రాతి నిధ్యంవహించే ఇండియా ప్రభుత్వం ఆసియాఖండంలో ఉవ్వెత్తుగా ముంచు కొస్తున్న ప్రజా విప్లవ వెల్లువనుచూసి, కంగారుపడి ఆంగ్లో - అమెరికన్ సామ్రా జ్యవాదులు పన్నుతున్న కుట్రలలో తాను కూడా భాగస్వామిగా చేరింది. ఈ కుట్ర కనుగుణ్యంగా దేశంలో పీడిత ప్రజల పోరాటాలకు నాయకత్వంవహించే కార్మిక కర్షక ఉద్యమాలపైనా, కమ్యూనిస్టుపార్టీ పైనా తీవ్రమైన నిర్బంధ విధానాన్ని అమలు జరుపుతోంది.

తాను "స్వతంత్ర" విధానాన్ని అనుస రిస్తున్నాననీ, ప్రపంచంలోవున్న రెండు శిబిరాలకు సంబంధం లేకుండా "తటస్థ" వైఖరిని అవలంబిస్తానని నెహ్రూ ప్రభు త్వము ప్రకటించుతోంది. కాని అదంతా వట్టి బూర్జువా పచ్చిమోసం. నెహ్రూ ప్రభుత్వం తటస్థంగా వుండకపోవడ మటుంచి, అమెరికా సామ్రాజ్యవాదం చెప్పుచేతలలో కీలుబొమ్మగా తయారై, విప్లవప్రతీఘాతానికి నాయకత్వంవహించు తోంది. భారత పరిశ్రమలను గుత్తకు తీసుకోవలసిందిగా నెహ్రూ ప్రభుత్వం విదేశ పెట్టుబడులను బహిరంగంగా ఆహ్వా నించుతోంది. అమెరికా గుత్త పెట్టుబడి దారుల ఆజ్ఞలను శిరసావహించి, పరిశ్రమ లను జాతిపరం చేయడాన్ని బుట్టదాఖలా చేసింది. పెట్టుబడిదారులకు లాభాలను గ్యారంటీ చేస్తున్నది. కార్మికోద్య మాన్ని అణచడానికని అనేక నిర్బంధ శాసనాలను ప్రవేశపెట్టింది. విచారణ లేకుండా వ్యక్తులను జైలులో వుంచివేయ డానికీ ఎప్పుడుపడితే అప్పుడు అరెస్టు చేయడానికి పోలీసులకు విపరీతమైన అధి కారాలను యిచ్చివేసింది. దేశములో ఫాసిస్టు భీభత్సంతో కూడుకున్న నిరంకుశ పాలన సాగించబడుతున్నది.

ఇప్పటికీ కార్మిక, కర్షక, విద్యార్థి ఉద్యమాలకు సంబంధిం చిన వారిని 25000 కు పైగా అరెస్టుచేసి జైల్లో పెట్టింది నెహ్రూ ప్రభుత్వం. డజన్లకొలది కమ్యూ నిస్టుపార్టీ పత్రికలనూ, యితర ప్రజాతంత్ర పత్రికలనూ ప్రచురణ కాకుండా నిషేధించింది. భారత కమ్యూనిస్టుపార్టీ బెంగాల్ శాఖ అక్రమ సంస్థగా ప్రకటించబడింది. కమ్యూనిస్టుపార్టీ, ట్రేడుయూని యను కాంగ్రెసు, విద్యార్థి ఫెడరేషన్, కిసాన్ సభకు చెందిన వందలాది నాయకులు అజ్ఞాత వాసానికి వెళ్ళిపోవలసి వచ్చింది. 144వ సెక్షను ప్రకటించడం, సభ లనూ, ప్రదర్శనాలను నిషేధించ డము - యివన్నీ దేశమంతటా లెక్కలేనన్నిసార్లు అమలు జరుప బడుతున్నాయి.

# నెహ్రూ ప్రభుత్వ ఫాసిస్టు పోకడలు

సమ్మెలను అణచలేక ప్రభుత్వం ఫాసిస్టు పద్ధతులకు దిగజారుతోంది. వందలాది కార్మికులను పనినుండి గెంటివేయడానికి వ్యతిరేకంగానూ, వేతనాలలో నూటికి 25 వంతు తగ్గించడానికి వ్యతిరేకంగానూ యిటీవల రైల్వే కార్మికులు జరిపిన సమ్మె సందర్భంలో 3000 మంది రైల్వే పనివాండ్రనూ, యితర ట్రేడు యూనియను కార్యకర్తలను అరెస్టుచేసి బంధిఖానాలో పడవేసింది. దేశమంతటా మిలిటెంటు స్వభావంగల ట్రేడుయూనియనుల కార్యకర్తలందరూ జైలులోనో, లేక అజ్ఞాతవాసంలోనో వుండిపోవలసి వచ్చిందంటే ఎంతటి క్రూర నిర్బంధవిధానము అమలు జరుపబడుతున్నదో ఊహించుకోవచ్చు.

సామాన్యప్రజల పోరాటాలను అణచివేసే సందర్భంలో ప్రభుత్వం తుపాకి కాల్పులతో వందలాది కార్మికులనూ, కర్షకులను చంపివేస్తున్నది. ఇటీవల బీహార్ రాష్ట్రంలో పోలీసులు వ్యవసాయ కూలీలపై తుపాకులు కాల్చిన ఫలితంగా అనేకమంది చనిపోయారు. ఫిబ్రవరి 19 వ తేదీన బెంగాల్‌లో ప్రభుత్వ పోలీసులు తుపాకులు కాల్చగా అక్కడే 6 గురు కర్షక స్త్రీలు చనిపోయారు. మార్చి 24 తేదీన బొంబాయి రాష్ట్రంలో ఎరగాన్ అనే గ్రామంలో ప్రభుత్వ పోలీసులు తుపాకులు కాల్చిన ఫలితంగా 4 గురు స్త్రీలు మరణించారు. ప్రభుత్వం యీ విధంగా ప్రజలనుండి వేరుపడిపోయి మాటిమాటికి తుపాకిగుళ్ళు కాల్చి జనాన్ని చంపనిదే పరిపాలన సాగించలేక పోతున్నది. తుపాకులు కాల్చి చంపకుండా ప్రజలను జైళ్ళలో పెట్టకుండా మామూలు ప్రజల ఉద్యమాన్ని ప్రభుత్వమణచలేదు.

**హైదరాబాద్ సంస్థానంలోవున్న తెలంగాణాలో వందలాది రైతులను క్రూరంగా కాల్చిచంపింది. రైతుల యిండ్లకు నిప్పుపెట్టి వారిని అగ్నికి ఆహుతిచేసింది. నిరంకుశ నైజాం పరిపాలనను అంతమొందించి భూస్వాములను పారద్రోలి రైతులకు భూములను పంచిపెట్టిన వీరోచిత తెలంగాణా రైతాంగాన్ని అణచివేయడానికి, స్త్రీలపై కాంగ్రెసు పోలీసులు జరిపిన అత్యాచారాలకు అంతులేదు. ఇదీనేడుమనదేశంలో నెహ్రూ ప్రభుత్వంక్రింది ప్రజలనుభవిస్తున్న క్రూర నిర్బంధాలు.**

ఇంతటి దారుణ నిర్బంధ విధానం తాండవమాడుతున్నా కార్మికులూ, రైతులూ, విద్యార్థులూ వీరోచితంగా పోరాడుతూనే ఉన్నారు. ట్రేడ్‌యూనియన్ ఉద్యమం దినదినాభివృద్ధి చెందుతోంది. కార్మికుల సమ్మెలు దేశమంతటా జరుగుతున్నాయి. రోజులు, నెలల తరబడి కార్మికులు ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని ప్రతిఘటించ గలుగుతున్నారు. నెహ్రూప్రభుత్వం పెట్టుబడిదారుల ప్రభుత్వమని, సామాన్యప్రజలకు వ్యతిరేక ప్రభుత్వమని స్పష్టపడిపోతున్నది. ఇండియాను అమెరికా సామ్రాజ్యవాదులకు అమ్మి

వేసిన ప్రభుత్వమనీ, సోవియట్ యూని యన్‌కు వ్యతిరేకంగా అమెరికాకు యుద్ధ కేంద్రంగా ఇండియాను మార్చివేయడానికి ప్రయత్నించుతున్న ప్రభుత్వమని, నెహ్రూ ప్రభుత్వపు ముసుగు కాస్తా బయటపడి పోతున్నది.

పెట్టుబడిదారీ విధానానికి ఏజంట్లయిన మితవాద సోషలిస్టులు కార్మికుల సమ్మెలను విచ్ఛిన్నం చేస్తున్నారు.

సోషలిజం అనే ముసుగు వేసుకొని అమెరికా అనుకూల ప్రచారమూ, సోవియట్ ప్రతికూల ప్రచారమూ చేస్తున్నారు. వారు బ్రిటిష్ లేబరుపార్టీ అనుచరులుగానూ, పెట్టుబడిదారీ విధానపు ఏజంట్లుగాను పూర్తిగా బయట పడి పోతున్నారు.

# రెండు ప్రపంచాలు రెండు విధానాలు

ఇతర ప్రజలతో పాటు భారత ప్రజలు కూడా విభిన్న పరిస్థితులుగల రెండు ప్రపంచాలున్నాయని గ్రహించగలుగుతున్నారు. సోషలిస్టు భూమిఅయిన సోవియట్ యూనియన్ లోనూ, తూర్పు యూరప్ ప్రజారాజ్యాలలోనూ కార్మికుల, సామాన్య ప్రజల జీవన ప్రమాణం క్రమేణా పెరుగుతున్నది. మామూలు ప్రజల కొనుగోలు శక్తి పెరుగుతున్నది. సామాన్య ప్రజలకు అందుబాటులో వుండేటట్లు అవసరవస్తువలన్నింటికీ ధరలను రోజు రోజుకు తగ్గించి వేస్తున్నారు. నిరుద్యోగమంటూ లేనేలేదు. పరిశ్రమలూ, వ్యవసాయంగా బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతున్నాయి. అక్కడ మానవుని శక్తి సంపదలు సంపూర్తిగా అభివృద్ధి చెందడాన్ని చూడగలుగుతున్నాం. ఈ ప్రపంచంవైపే ప్రపంచంలోని శ్రామిక ప్రజలంతా ఆశతో ఎదురు చూస్తున్నారు. అన్ని దేశాలలోని శ్రామిక ప్రజలూ తమ తమ దేశాలలో పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసి యిలాంటి ప్రపంచాన్ని నిర్మించుకోడానికే పోరాడుతున్నారు. ఈ ప్రపంచంపైన మామూలు ప్రజానీకానికి చెందిన యీ ప్రపంచంమీద సామ్రాజ్య వాదులు చేసే దాడిని భారతప్రజలు భారత కార్మికవర్గ నాయకత్వాన తమభవిష్యత్తుపై దాడిగా భావించుతారు. భారత ప్రజలు సోవియట్ యూనియన్ నాయకత్వాన యితర ప్రపంచ ప్రజలతో భుజం భుజం కలిపి శాంతి ప్రజాస్వామికం, సోషలిజముల రక్షణ కోసం పోరాడుతారు.

ఈ విధమైన ప్రంపంచానికి మారుగా పెట్టుబడిదారీ పరిపాలనగల రెండో ప్రపంచముంది. ఈ ప్రపంచంలో ప్రజలు విపరీతమైన బాధలకు గురి అవుతున్నారు. నిరుద్యోగం ప్రతిచోటా తాండవిస్తోంది. సామాన్యప్రజల పరిస్థితులు రోజురోజుకు విషమించుతున్నాయి. ఇండియాలో జీవన ప్రమాణం రోజురోజుకు తగ్గిపోతున్నది. ఇండియా ప్రభుత్వం లెక్కల ప్రకారమే కార్మికుల వేతనాలు 9939 వేతనాలను దృష్టిలో వుంచుకొని అంచనావేస్తే 115% నుండి 150%వరకూ పెరిగింది. ఆ అంచనా ప్రకారమే జీవనవ్యయం 150 నుండి 250 వరకు పెరిగిపోయింది. వేలకొలది కార్మికులు వివిధ పరిశ్రమలలో పనినుండి వెళ్ళగొట్టబడి నిరుద్యోగులవుతున్నారు. మిల్లులను, ఫ్యాక్టరీలను కట్టివేస్తామని బెదరించుతున్నారు. బొంబాయిలో అప్పుడే ఒక షిఫ్టువర్కు రద్దుచేయబడింది. వేలకొలది కార్మికులు నిరుద్యోగులు కాబోతున్నారు. ప్రభుత్వోద్యోగులసంఖ్యను తగ్గించివేయడానికి

ప్రభుత్వం విపులంగా సన్నాహాలను చేస్తున్నది. ఈ విధమైన పరిస్థితులకు వ్యతిరేకంగా భారత కార్మికవర్గం అతి నిబ్బరంగా పోరాడుతున్నది.

## శ్రామిక ప్రజలకు సోవియట్ నాయకత్వం

అంతర్జాతీయ కార్మికవర్గనాయకుడుగానూ, అన్ని దేశాలలోని శ్రామిక ప్రజల నాయకుడుగాను సోవియట్ యూనియనను భారత కార్మికవర్గం ఎల్లప్పుడు పరిగణించుతూనే వచ్చింది. ప్రపంచ శాంతికోసం ఎల్లప్పుడూ కృషిచేసేది సోవియట్ యూనియనే. వలసదేశాల ప్రజల విముక్తి ఉద్యమాలను ఎల్లప్పుడు బలపరచేది. సోవియట్ యూనియను అనే విషయం అందరికీ తెలుసు. అందువల్లనే సోవియట్ యూనియన్‌పై ఎలాంటి దాడి జరిగినా, దానిపై ఎలాంటి కుట్ర జరిగినా భారత కార్మికవర్గం తన మిత్రునిపై, తన రక్షకునిపై జరిగినట్లు భావించుతుంది. అమెరికా సామ్రాజ్యవాదుల ఆజ్ఞల నందుకొని సోవియట్ యూనియనుకూ ఆసియాదేశాలలోని విముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా ఇండియాను యుద్ధానికి యీడ్చే భారత పెట్టుబడిదారుల ప్రతి ప్రయత్నాన్ని భారత కార్మికులు అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసు నాయకత్వాన ప్రతిఘటించి తీరుతారు.

భారత కార్మికోద్యమం ఎల్లప్పుడూమార్క్సు-ఎంగిల్సు-లెనిన్ స్టాలిన్ల శ్రామికవర్గ అంతర్జాతీయ సిద్ధాంతాల కనుగుణ్యంగానే నడుస్తుంది. అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన ప్రతికీలక క్లిష్ట సమయంలోనూ భారత కార్మికవర్గం అంతర్జాతీయ విప్లవ కార్మికోద్యంతో భుజంభుజం కలిపి సరియైన వైఖరినే అవలంబించింది.

★ 1939 అక్టోబరు 2వ తేదీన సామ్రాజ్యవాదయుద్ధం యెడల తమ అసమ్మతిని ప్రకటించేందుకు భారత కార్మికవర్గం సమ్మె చేసింది. ఎదురుతిరిగిన వారిని క్రూరంగా బాధిస్తామని బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఎంత బెదిరించినప్పటికీ సామ్రాజ్యవాద యుద్ధానికి ప్రతికూలంగా బొంబాయిలో 100000 కార్మికులు సమ్మె చేశారు.

★ 1941 లో సోవియట్ యూనియను ఫాసిస్టులచే దాడి చేయబడినప్పుడు భారత కార్మికవర్గం అంతర్జాతీయ సిద్ధాంతాల ననుసరించి అన్ని దేశాలలోని ప్రజలతో భుజం భుజం కలిపి ఫాసిజం ఓటమి కోసం అన్ని దేశాల ప్రజల విముక్తి కోసం పోరాడించి.

★ ఈనాడుకూడా భారత కార్మికవర్గం శ్రామికవర్గ అంతర్జాతీయ సిద్ధాంతాలను దృష్టిలో వుంచుకొని ప్రపంచంలోని వివిధ శ్రామికప్రజలతో భుజం భుజం కలిపి సోవియట్ నాయకత్వాన సామ్రాజ్యవాదుల మూడో ప్రపంచ యుద్ధాన్ని ప్రతిఘటించుతుంది. ఇండియాను సోవియట్ వ్యతిరేక యుద్ధకేంద్రంగా మార్చే నెహ్రూ ప్రభుత్వ ప్రతి ప్రయత్నాన్ని ప్రతిఘటించి తీరుతుంది.

భారత కార్మికవర్గం తరఫున భారత శ్రామిక ప్రజాకోటి తరఫున అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు శాంతి

కోసం జరిగే యీ మహాసభను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నది. ప్రపంచ శాంతికోసం, ప్రజాస్వామికం కోసం, సోషలిజంకోసం జరిగే పోరాటంలో ప్రపంచంలోని యితర ప్రజలతో బాటు భారత కార్మికవర్గం పాల్గొని తీరుతుంది. మాభూమిని, మాపరిశ్రమలనూ, మా సహజ సంపదనూ, మా మనుష్య సంపత్తినీ సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా, అన్నిదేశాలలోని, ప్రజల విముక్తి పోరాటాలకువ్యతిరేకంగా అక్రమ సామ్రాజ్యవాద యుద్ధంలో ఎంత మాత్రము ఉపయోగపడనీయం.

ఈ ప్రపంచంలో నాలుగో వంతు జనాభాకు ప్రాతినిధ్యం వహించుతున్న శాంతి కాముకుల యీ మహత్తర సమావేశం ప్రపంచశాంతి రక్షణ కోసం, వివిధ ప్రజల జాతీయ స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామికంకోసం, సోషలిజంకోసం– ప్రపంచాధిపత్యంకోసంఅర్రులు జాస్తున్న ఆంగ్లో – అమెరికన్ రక్త పిపాసుల దుర్మార్గపు కుట్రలకు వ్యతిరేకంగా – ఒక బ్రహ్మాండమైన ప్రపంచ వ్యాపిత ఉద్యమానికి నాంది అగుగాక !

# గ్రీసులో మారణ హోమం

## స్వాతంత్ర్య వీరుల వీరోచిత త్యాగాలు

యం. స్మిర్నోవ్

1948 వ సంవత్సరం ఆఖరురోజుల్లో గ్రీకురాచరికఫాసిస్టులు జైళ్ళల్లో బంధించబడి ఉన్న రాజకీయ ఖైదీలను బయటికి లాగి వారిని ఉరితీయసాగారు: ఈ ఉరిశిక్షల కసమ్మతి తెలియపరుస్తూ ఉరిశిక్ష విధించబడిన 600 మంది దేశభక్తులు ఆగినాద్వీపంలో నిరశనవ్రతం ప్రారంభించారు. గ్రీకుదేశభక్తులపై జరుగుతోన్న ఈ హత్యాకాండను - ఈ మారణ హోమాన్ని - అరికట్టవలసిందని మరణశిక్ష విధించబడిన మరో మూడు వేలమంది ప్రజాస్వామికవాదులు భద్రతాసమితికీ, మిత్రరాజ్యాల రాజకీయ నాయకులకూ, ప్రజాస్వామిక సంస్థలకూ విజ్ఞప్తి చేశారు.

అమెరికా సామ్రాజ్యవాదుల ఏజెంట్లు అయిన ఎథెన్సు (గ్రీసు రాజధాని) పరిపాలక వర్గాలు నేరస్థులను మాత్రమే ఉరితీస్తున్నాం అని బూటక ప్రచారం చేస్తున్నారు. ఇది ఎంత శుద్ధాబద్ధమో వేరే చెప్పనవసరంలేదు. నాలుగు సంవత్సరాలకు పూర్వమే శిక్షించబడి జైళ్ళలో బంధించబడిన ఖైదీలను ఇప్పుడు బైటికి లాగి వరసగా నిలబెట్టి కాల్చివేస్తూ మరో వైపు ఇలాంటి బూటక ప్రచారం చేసినంతమాత్రాన ప్రజలెవరూ మోసపోరు. మనోలిస్ గ్లెజోస్‌లాంటి ప్రజానాయకునికీ మరో పదిమంది ట్రేడుయూనియన్ నాయకులకూ ఫాసిస్టుకోర్టుల్లో బూటకపు విచారణ జరిపి మరణశిక్ష విధించబడింది. ఫాసిస్టు 'జడ్జీల' దృష్టిలో మాతృభూమి స్వాతంత్ర్యాన్ని కాంక్షించడం, కాపాడడముకూడా ఒక మహాపరాధంగానే పరిగణించబడుతోంది.

1944 డిసెంబరులోనూ, 1945 జనవరిలోనూ బ్రిటిష్ సైన్యానికి గ్రీకు ప్రజాసామాన్యం 'ఎలాస్'కీ మధ్య జరిగిన 33 రోజుల యుద్ధం 'వర్కిజా' ఒడంబడికతో ఆగిపోయింది. డిసెంబరు పోరాటంలో పాల్గొని ఖైదీలుగా పట్టుబడిన వారి నందరినీ వెంటనే విడుదల చేయాలని ఈ సంధిపత్రంలో ఉంది. కాని గ్రీకు ప్రభుత్వం మాత్రం యీనిర్ణయాన్ని పాటించలేదు. రాజకీయాశయాలకోసం ఆ ఖైదీలు పోరాడలేదనీ, వారు నేరస్థులనీ

బ్రిటిషు గ్రీకు ప్రభుత్వాలు సాకు జెప్పాయి. 'వర్కిజా' ఒడంబడిక కుదిరిన వెంటనే ఆ ఒడంబడిక ప్రకారం గ్రీకు ప్రజా సైన్యం అస్త్రసన్యాసం చేసింది. దీన్ని అవకాశంగాతీసుకొని గ్రీసులోని యక్స్ మితా సభ్యులూ (వీరిటోపీలపై యక్స్ గుర్తు 'X' ఉంటుంది.) ఫాసిస్టులూ 'ఎలాస్' స్వాతంత్ర్య యోధులపై, కమ్యూనిస్టుపార్టీ సభ్యులపై దొంగ కేసులు బనాయించసాగారు. 80 వేలమందిపై నేరాలు మోపబడ్డాయి. నాజీ జర్మనీకి తొత్తులుగామారి నాజీ యూనిఫారమ్ ధరించి నాజీ ఆయుధాలతో ప్రజలను హింసించిన ప్రజా ద్రోహులకు బుద్ధి జెప్పినందుకుగాను 'ఎలాస్' సభ్యులకు అతిదారుణమైన శిక్షలు విధించబడ్డాయి. గెస్టెపో ఏజెంట్లనూ (నాజీ గూఢచారులు) ప్రజా ద్రోహులనూ శిక్షించిన ప్రజాకోర్టుల్లో పాల్గొన్న ప్రజానీకం చిత్రహింసకు గురిచేయబడింది. దొంగ ఖూనీకేసులు బనాయించి (ఏవ్యక్తులను చంపారని కేసు పెట్టబడిందో ఆ వ్యక్తులు సజీవంగా కండ్లముందు కన్పిస్తున్నప్పటికీ) మరణశిక్షలూ, లేక 20 సంవత్సరాల కఠిన జైలుశిక్షలూ విధించబడ్డాయి.

యుద్ధకాలంలో విముక్త గ్రీసులోని బ్రిటిష్ సైన్యానికి అధిపతిగా పని చేసిన కర్నల్ వుడ్‌హౌస్ 1947 సెప్టెంబరు 27వ తేదీ మాంచెస్టర్ గార్డియన్ పత్రికలో నాజీ వ్యతిరేక పోరాటంలో వీరోచితంగా పోరాడిన డిమిట్రియాఫ్, కరమిఖాలిస్, కత్‌సింబస్ అనే యోధులను గురించి "ముగ్గురు గ్రీకులు" అనే శీర్షికక్రింద ఒక వ్యాసం వ్రాశాడు. గ్రీసులో నాజీవ్యతిరేక విధ్వంసక చర్యల్లో డిమిట్రియాఫ్ అత్యంత ప్రధానపాత్ర వహించాడు. ఇతను సాగించిన విధ్వంసక చర్యలఫలితంగా నాజీసేనాధిపతి రోమెల్ ఉత్తర ఆఫ్రికాపై తీవ్రమైనదాడి సాగిస్తోన్న సమయంలో అతని సైన్యానికి సప్లయిలు అందకుండా పొయ్యాయి. డిమిట్రియాఫ్ లాంటి వీరాగ్రేసరులకూ వారి వీరోచిత చర్యలకూ బదులుగా నేడు వారికి లభించిన పురస్కారమేమిటి? ఉరిశిక్ష. నాజీ సైనికులను కాల్చిచంపిన నేరానికి డిమిట్రియాఫ్, కరమిఖాలిస్‌లకు మరణదండన విధించబడింది. కత్‌సింబస్ నాలుగు సంవత్సరాలనుంచి డిటెన్షన్‌లో ఉన్నాడు. అతనిపైకూడా ఇలాంటి హత్యా నేరమే మోపబడింది. ఇంకా కేసు నడుస్తూనే ఉంది.

ఈ దిగువనిచ్చే ఉదాహరణలనుబట్టి గ్రీకు రాచరిక ఫాసిస్టువాదుల కోర్టుల్లో కేసులూ, తీర్పులూ, ఎలావుంటాయో తెలుసుకోవచ్చు.

అగ్గిటిస్ అనే ఒక పోలీసు కెప్టెన్‌ను 1943 ఫిబ్రవరిలో హెలెని అనే గ్రామములో హత్యచేశారనే నేరంక్రింద స్పార్టాలోఉన్న జూరీ సంతాస్ అనే 'ఎలాస్' సభ్యునిపై 1946 జనవరి 9వ తేదీన హత్యానేరం ఆపాదించి తీర్పుచెప్పినది. ఒక నెలరోజుల తదనంతరం మళ్ళీ అదే కోర్టు పైజెప్పిన కెప్టెన్‌హత్య మెటోచీ అనే గ్రామములో 1943 నవంబరులో జరిగిందనీ అందుకు బాధ్యుడు బజియకోస్ అనీ అతనిపై తీర్పు చెప్పబడింది. తర్వాత మళ్ళీ రెండురోజులకే పైజెప్పిన కెప్టెన్ యొక్క హత్యమోమెమెన్ వజియా అనే గ్రామములో జరిగిందనీ అందుకు కారకుడు మనికిస్ అనీ అతనిపై మళ్ళీ తీర్పు చెప్పబడింది.

డిసెంబరు పోరాటంలో 128 మంది రాచరిక ఫాసిస్టుల చావుకు 'నైతికంగా' బాధ్యత వహిస్తున్నాడనే నేరం క్రింద 'పాతపిస్' అనే "ఇ. ఏ. యం" (ప్రజా సంఘటన సంస్థ) సానుభూతి పరుని 'పిరేయిస్' వద్ద విచారించడం జరిగింది. 'పాతపిస్' 'కొక్కినియా' అనే పట్టణానికి మేయరు. ఇతనిపై మోపబడిన కేసు అంతా వట్టి అభూతకల్పన అని ఆపట్టణ ప్రజలందరికీ స్పష్టంగా తెలుసు కోర్టులో-న్యాయస్థానంలో-ఏమాత్రమైనా న్యాయమంటూ ఏమాత్రం మిగిలిఉన్నా అతన్ని వెంటనే విడుదలచేసి ఉండేది. కాని ఆన్యాయస్థానాలు నేతిబీరకాయల్లాగా ఎప్పుడో తయారయ్యాయి. 128 మంది జాతీయ వాదులను 'స్వయంగా' చంపాడనే నేరం క్రింద అతనిమీద 128 కేసులు మోపబడ్డాయి. చివరకు అతనికి ఉరిశిక్ష విధించబడింది.

'ఎలాస్' సభ్యులపై హత్యానేరం ఆపాదించడానికి ఎట్టి అవకాశమూ దొరకని పక్షంలో నాజీ ఆక్రమితకాలంలో 'అక్రమంగా ఆయుధాలను'కలిగిఉన్నారు అనే నేరం క్రింద కేసు మోపబడుతుంది. ఆయుధాలు ధరించి నాజీ ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడడం కూడా ఒక మహానేరమే !

ఈ కిరాతకాలన్నీ బ్రిటిష్‌ప్రభుత్వాంగీకారంపై ఇదివరకు జరిగినట్టే ఇప్పుడు అమెరికా ప్రభుత్వం అనుమతిపై జరుగుతున్నాయి. జైళ్లూ, నిర్బంధాలూ, హత్యలూ ప్రజావుద్యమాన్ని నిర్మూలించలేవని చరిత్ర చాటి చెపుతోంది.

ఏథెన్సులోని అవెరోవ్ జైల్లో గత సంవత్సరం ఫిబ్రవరి 12వ తేదీన జరిగిన సంఘటనే ఇందుకు నిదర్శనం. కపరెలిస్, కండెలికియాన్ అనే ఇద్దరు దేశభక్తులను మరో జైలుకు మార్చాలి అనే మిషతో ఉరిశిక్షితుల గదిలోనుంచి వారిని బైటికి తీశారు. ఆరాత్రి కొంత ప్రొద్దుపోయిన తర్వాత "కామ్రేడ్సు! రేపు ప్రొద్దు పొడిచేవేళకు మా యిద్దర్నీ కాల్చి చంపేస్తారు"అని ఆయిద్దరిలో ఒకరు కేక వేశారు. మిగతా ఖైదీలందరకూ వెంటనే ఈ కేక వినబడింది. ఈదుర్మార్గచర్యకు అసమ్మతి తెలియపరుస్తూ ఖైదీలంతా బ్రహ్మాండమైన ఆందోళన ప్రారంభించారు. ఖైదీల ముష్టిఘాతాలతో ఇనపకటకటాలు వేయి గొంతులతో ధణధణమన్నాయి. మళ్లీ బిగ్గరగా మాట వినవచ్చింది. ఆ ఇద్దరిలో ఒకరిలా అంటున్నారు :

**"కామ్రేడ్స్, మన ఎర్రజెండా ప్రతిష్ఠ నిలబెట్టండి! సాగించండి, స్వాతంత్ర్య సమరము! విజయం మనదే!"**

అంటూ స్వాతంత్ర్య గీతం పాడసాగాడు. వేల గొంతుల్లోనుంచి వెంటనే ప్రతిధ్వనించింది ఆ పాట. ఆ రాత్రి ఎవ్వరూ నిద్రపోలేదు. తెల్లవారగానే ఆ ఇద్దరిని వధ్యశాలకు కొనిపోయేటప్పుడు **నా పిల్లల బాధ్యత మీ పైనే ఉంచివెళ్లుతున్నాను. కామ్రేడ్స్" అన్నాడు కపరెటిలిస్. "మరేం భయంలేదు. మరేంపర్వాలేదు." అని నాలుగు వందల గొంతుకలు ఒకేసారి సమాధానమిచ్చాయి.**

ఫిబ్రవరి 28వ తేదీన మరో 12 మందిని జైలునుంచి బైటకి తీసుకొని పోవలసివచ్చింది. ఫిబ్రవరి 12వ తేదీన జరిగినట్లుగా ఈసారి ప్రదర్శనం జరగనివ్వరా

దని జైలు వార్డర్లు నిశ్చయించుకున్నారు. ఎలాగో ఈవార్త ఖైదీల చెవుల్లోకి దూరింది. జైలు కిటికీల్లోనుంచి అర్థరాత్రి వేళ బిగ్గరగా ఒక గొంతు వినిపించింది. "ఏథెన్సు ప్రజలారా! బానిసత్వ సంకెళ్ళలో బంధించబడిన సోదరులారా! మీ బిడ్డలైన మమ్ము, మీ స్వాతంత్ర్యం కోసం పోరాడిన మమ్ము అమెరికా సామ్రాజ్యవాదుల తొత్తులైన గ్రీకు రాచరిక ఫాసిస్టులు చంపివేయబోతున్నారు." తర్వాత ఆ గొంతులోనుంచే చంపబడేవారి పేర్లు ఒక్కొక్కటే వరసగా వినబడ్డాయి. స్వాతంత్ర్య సమరగేయాలతో జైలు గోడలన్నీ ప్రతిధ్వనించాయి. వధ్యశాలకు కొనిపోబడేవారు ఒక్కొక్కరే తమ రెండు చేతులెత్తి పిడికిలి బిగించి బిగ్గరగా నినాదాలిస్తూ శాల్యూట్ చేశారు. రెండుచేతులకూ కలిపి అరదండాలు వేయడంవల్ల శాల్యూట్ చేయడానికి వారు తమరెండుచేతులు పైకిఎత్తవలసి వచ్చింది.

'ఎలాస్ వర్ధిల్లాలి!' 'గ్రీసు వర్ధిల్లాలి!' 'విజయం మనదే!' అనే నినాదాలతో ఖైదీ కామ్రేడ్సు వారికి వీడ్కోలిచ్చారు.

అవెరోవ్ వగైరా గ్రీకు చెరసాలల్లో ఇలాంటి ఘటనలు నేడు మామూలై పొయ్యాయి. ఇలాంటి మారణహోమాలు నిత్యకృత్యాలయిపొయ్యాయి. మే నెల 4,6,7 తేదీల్లో ఎందరు దేశభక్తులు కాల్చివేయబడ్డారో ఇంతవరకెవ్వరికీ తెలియదు. అధికారవార్తలు 139 మంది అనీ అనధికార వార్తలు 238 మంది అనీ తెలియజేస్తున్నాయి. అవెరోవ్ జైలునుంచి ఈసారి 23 రు దేశభక్తులు కాల్చివేయబడ్డారు. అగినాద్వీపంలో 36 గురిని ఉరితీయడం జరిగింది.

అమెరికా సామ్రాజ్యవాదులకు ఏజంటుగా పనిచేస్తోన్న సల్దారిస్ ప్రభుత్వం ఉత్తమ దేశభక్తులైన ఈ ఖైదీలను హంతకులుగానూ, దోపిడీదొంగలుగానూ చిత్రిస్తూ ఉంది. వీరిపై రేడియోల్లోనూ, పత్రికల్లోనూ విషప్రచారం చేస్తూఉంది. ఉరికంబాలను కౌగిలించుకోబోతూన్న సమయంలో వారువ్రాసిన ఉత్తరాలే వారి ఉత్తమ దేశభక్తికి తార్కాణాలు. అవెరోవ్ జైలునుంచివచ్చిన కొన్ని ఉత్తరాలను మచ్చుకు ఇక్కడ ఉల్లేఖిస్తాను.

వంజెలియా థియోడోర్ తన భార్యకిలా వ్రాస్తున్నాడు.

"జూలియా!

ఈ ఉత్తరం నీకు అందేలోపుగానే నన్ను ఉరితీయడం జరిగిపోయితుంది. నామరణ వార్త విని నీవు విచారించవలదు. ఈ కిరాతకులకు–ఈ ఫాసిస్టులకు–నూకలునిండాయి. నేడు విప్లవకారులు కార్చే ఈ రక్తమే ఈ ప్రజాద్రోహులను భూమిపైనుంచి శాశ్వతంగా తుడిచివేస్తుంది. ఈ రక్తమే మనకు విజయాన్ని సాధిస్తుంది. స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తుంది. విప్లవకారులవలె వీరులవలె నేనుకూడా

సగర్వంగా సంతోషంగా మరణిస్తున్నాను. ఈ ఫాసిస్టు ప్రభుత్వం నేడు మనలను హంతకులనీ, బందిపోటుదొంగలనీ అంటోంది. ఎవరు హంతకులో ఎవరు దొంగలో త్వరలోనే చరిత్ర తీర్పుచెప్పుతుంది. చివరవరకూ ఈపోరాటంలో విజయం సాధించే వరకూ నీవు మన పోరాటాశయాలకు బద్ధురాలవై ఉండాలి. ప్రజాస్వామికం చిరకాలం వర్ధిల్లుగాక!"

"ప్రియమైన బిడ్డలారా! స్పిరిడీలా! ఆండ్రోస్! క్రిస్టోస్! అథనిసియోస్! మీ అందరికీ నాముద్దులు. ప్రజాద్రోహులు మీ నాన్నను చంపివేయబోతున్నారు. మీనాన్న ప్రజలనూ దేశాన్ని మోసంచేయలేదు— చేయడు. నా ముద్దు బిడ్డలారా! 'మీతండ్రిలాగే మీరుకూడా పోరాడండి' ఇదే మీకు నా అంతిమ సందేశం. మీనాన్న గౌరవప్రదమైన పంథానవలంబించాడు. సత్యమార్గాన్ని చేపట్టాడు. ప్రజాద్రోహుల నెదిరించి పోరాడాడు. మీరంతా సన్నిహితంగా ఒకే కుటుంబంలాగా కలసిమెలసి ఉండండి! ఒకరినొకరు గౌరవించుకోండి! అధ్యయనం చేయండి! విజ్ఞానాన్ని ఆర్జించండి! అప్పుడు కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేరండి! ప్రపంచంలో ఉత్తమోత్తములైన ఆప్రజల మధ్యనే— ఆసభ్యుల మధ్యనే—ఉండండి. పార్టీకోసం పనిచేయండి. విజయం మీదే. మీ నాన్నకోసం మీరు విచారించకండి. నిజమైన దేశభక్తుడులాగా మీనాన్న ప్రాణాలర్పించాడు. మీనాన్న వృధాగా తన రక్తాన్ని చిందించలేదు. ఉరికంబాన్ని కౌగిలించుకోబోయేముందు నేను మీకిచ్చే సందేశంఇదే. నా ప్రియమైన బిడ్డలారా! మరోసారి మీ అందరికీ నా ముద్దులు.

ఇట్లు మీనాన్న,
వంజెలియా థియోడోర్.

ఉరితీయబడిన వారిలో అందరికంటె వయస్సులో పిన్న అయిన డెమిట్రియోస్ కొమ్మినోస్ అనే యువజన సంఘ సభ్యుడు ఇలా వ్రాస్తున్నాడు:—

"ఇవి నా అంతిమ అభివందనాలు. నాకోసం మీరువిచారించ

వలదని కోరుతున్నాను. స్వాతంత్ర్యం కోసం - విజయం కోసం - ప్రాణాలర్పించిన - రక్తం ధార పోసిన-అమరజీవులతోపాటు నేను కూడా ప్రజాహృదయంలో అమర జీవిగానే ఉంటాను. ప్రజలకోసం పోరాడినందుకు ప్రజల కోసం ప్రాణాలర్పిస్తూన్నందుకు నేనుగర్విస్తున్నాను. గ్రీకు ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో ఈ నా బలిదానం దారిజూపే ఒక దీపికగా ఉండగలదని ఆశిస్తున్నాను. మన పోరాటం కోసం పోరాటంలో విజయం కోసం మీ శారీరక మానసిక శక్తులన్నింటినీ పూర్తిగా ఉపయోగించండి! సదా ముందుకు పురోగమించండి! సోదరులారా! మీకు నా ముద్దులు."

స్పిరిడన్ రిజోకోస్తాస్ తన తల్లికి ఇలా వ్రాస్తున్నాడు :

ఊరిగది,
4—3—48

ప్రియమైన అమ్మా !

ఇదే నీకు నా ఆఖరి ఉత్తరం. ఇవే నీకు నా అంతిమ అభివందనాలు. నీవు దుఃఖించవద్దు. విచారించవద్దు. నీ కుమారుడు ప్రజలకోసం మరణిస్తున్నందుకు నీవు గర్వించాలి. నన్ను ఉరితీసే సమయం సమీపిస్తూ ఉన్నది. ఏ స్వతంత్ర పతాకంక్రింద వేలకొలది ప్రజాయోధులు తమ ప్రాణాలు బలియిచ్చారో అదే పతాకంక్రింద నా ప్రాణాన్ని కూడా సమర్పించ గలిగినందుకు గర్విస్తున్నాను. కష్టపడకుండా, త్యాగాలు చేయకుండా పోరాటమంటూలేదు. విజయమూలేదు. ఈ పోరాటంలో పాల్గొనే వారందరూ నీకు పుత్రుల్లాంటివారే. కొద్దిసేపట్లోనే వధ్యశాలకు వెళ్ళబోతూన్నాం. అయినా మేమందరం చాలా ఉత్సాహంగా ఉల్లాసంగా ఉన్నాం. ఇప్పుడు మేము స్వేచ్ఛగా స్వాతంత్ర్య గేయాలు పాడుకుంటున్నాం. అమ్మా ముద్దులు. సెలవు.

ఇట్లు,
నీ కుమారుడు
స్పిరో

కర్వోనిస్ అనే కామ్రేడ్ ఇతర జైళ్ళల్లో ఉన్న తనతోటి కామ్రేడ్సుకు ఇలా వ్రాశాడు:—

"అమెరికన్ టామిగన్నులోనుంచి దూసుకుపోతూవచ్చే తూటాలకు శాంతంగా ప్రశాంతంగా నా రొమ్ము ఇచ్చి నుంచుంటాను. జీవితానికి గీటు రాయి ఎంతకాలం బ్రతికాడా అని కాదు; ఏలాంటి పనులు చేశాడనేదే సమస్య. నాశక్తినంతా పోరాటానికీ, ప్రజలకీ ధారపోశానని నేను పూర్తిగా సంతృప్తి చెందుతున్నాను. నా మరణం వల్ల ఖాళీ అయ్యే స్థలాన్ని పూర్తి చేయవలసిందని నా బంధువు

లను కోరుతున్నాను. మానవుడు లాగా ఎలా జీవించాలో ఎలా మరణించాలో, తెలిసిన మానవుడు అనుభవించే ఆనందాన్ని అనుభవిస్తున్నాను."

"క్షమాపణ కోరుకుంటే ప్రతిఘటనోద్యమంలో పాల్గొని ఉరిశిక్ష విధించబడిన వారిపట్ల దయచూపుతామని ఏథెన్సు ప్రభుత్వం వాగ్దానం చేసింది. కాని క్షమాపణ కోరడమంటే అర్థమేమిటి? ప్రతిఘటనోద్యమాన్ని-స్వాతంత్ర్య పోరాటాన్ని-ఆ పోరాటంలో పాల్గొన్న వారిని-పాల్గొనబోయేవారిని-ఖండిచడం అన్నమాట. ఏ మహాదాశయంకోసం లక్ష 20 వేలమంది దేశభక్తులు తమ ప్రాణాలను బలి ఇచ్చారో ఆ మహాదాశయాన్ని, కమ్యూనిస్టుపార్టీనీ, ప్రజాసైన్యాన్నీ వెన్నుపోటు పొడవడమన్న మాట. ఉరిశిక్ష విధించబడిన మూడువేల మందిలో ఒక్కరు కూడా ప్రభుత్వం పెట్టిన ఈ దిక్కుమాలిన ఈ షరతుకు తల ఒగ్గలేదు. తమ బ్రతుకు నాశించి పిరికి పందల్లాగా ప్రవర్తించి తోటి కామ్రేడ్సుకు ప్రజలకూ ద్రోహం చేయ నిరాకరించారు. మృత్యువును కూడా లక్ష్యం చేయకుండా తమ కర్తవ్యాన్ని వీరోచితంగా నిర్వహించారు. పార్టీ ప్రతిష్ట కాపాడారు.

ఉరిశిక్ష విధించబడిన కేసుల్లో తాను జోక్యం కలిగించుకోనని ఏథెన్సు ప్రభుత్వం చెప్పుకుంటూఉంది. కాని ఇది పచ్చిఅబద్ధమని ప్రజలందరికి తెలుసు. ఉదాహరణకు ఏథెన్సు ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రి అయిన లాడాస్ చేసిన పనేమిటో చూడండి! స్పెషల్ కోర్టుల్లోనూ, క్రిమినల్ కోర్టుల్లోనూ ఉరిశిక్ష విధించబడిన ఖైదీల అప్పీళ్ళను త్వరత్వరగా పూర్తిచేయవలసిందనీ, అతివాదుల విషయంలోమాత్రం కనికరించ వలదనీ జడ్జీలకు ఆర్డర్లు జారీచేశాడు. ఈ అర్డర్లనూ వీటికి సంబంధించిన సూచనలను అతి రహస్యంగా ఉంచాలనీ, ఆర్డర్ల కాగితాలు ఎవరికి చిక్కకుండా తగలబెట్టివేయాలనీ వాటిలోనే సూచించాడు. అయినప్పటికీ తమ చర్యలకెప్పుడో ఒకప్పుడు ప్రజలముందు సమాధాన మివ్వవలసి ఉంటుందని గ్రహించిన కొందరు జడ్జీలుమాత్రం ఆ ఆర్డర్లను తగులబెట్టివేయకుండా భద్రంగా దాచారు. కాని అందులోని విషయాలనుమాత్రం ప్రజలకు తెలిసేటట్లుచేశారు. ఫాసిస్టు కోర్టుల్లో ఎంతన్యాయం ఉంటుందో ఈ ఒక్క విషయాన్నిబట్టే స్పష్టంగా తెలుసుకోవచ్చు.

గ్రీకు సోవియట్ సొసైటీ అధ్యక్షుడైన ప్రొఫెసరు కిత్ సికిస్ భార్య బీటా కిత్ సికిస్ కేసు విచారణ సందర్భంలో

హాజరైన మిలటరీ ప్రాసిక్యూటర్ ఈ విచారణంతా కేవలం బూటకమే అనీ, ముద్దాయిల భవిష్యతును న్యాయశాఖా మాత్రి ఎప్పుడో నిర్ణయించివేశాడనీ బహిరంగంగానే చెప్పాడు. ఈ స్త్రీని (బీటా కిత్ సికిస్) సర్వ నాశనం చేసివేయండని న్యాయశాఖామంత్రి తనతో ఒక ప్రత్యేక సమావేశంలో చెప్పినట్లుకూడా ఆ ప్రాసిక్యూటరే ఒకసారి ప్రకటించాడు. బీటాపై మోపబడిన కేసులో ఏమీ పస లేకపోయినప్పటికీ, ప్రాసిక్యూషన్ సాక్ష్యాన్ని బట్టే ఈ కేసంతా వట్టి బూటకమే అని తెలిపోయినప్పటికీ ఆమెకు ఉరిశిక్ష విధించబడింది.

ఇలాంటి కేసులనెన్నిటినైనా పేర్కొనవచ్చు. "ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల పశ్చిమ ప్రజాస్వామికంలో ధర్మదేవత నాలుగు కాళ్ళమీద నడుస్తుంది." అని చెప్పే పత్రికల నిజానిజాలు తెలుసుకోడానికి గ్రీసు దేశమే ప్రబలసాక్షి. ప్రజాద్రోహులపై పగదీర్చుకోడానికి ప్రజల క్రోధాగ్ని నాలుకలుసాచుతోంది. నరహంతకులపై తీర్పుచెప్పే రోజులు ఇంకా ఎంతో దూరానలేవు. సమయం సమీపిస్తోంది.

—'న్యూ టైమ్సునుండి'
(12—1—49)



# ఆఫ్గనిస్తాన్ పై అమెరికా కబంధుని హస్తం



ఇ. అర్టమొనోవ్

అమెరికాకు ఆఫ్గనిస్తాన్ పది వేల కిలోమీటర్ల (కిలోమీటరు అనగా దాదాపు 5 ఫర్లాంగులు) దూరాన ఉన్నప్పటికీ అమెరికా కబంధునిహస్తం ఆఫ్గనిస్తాన్ పైకి కూడా ప్రసరించింది. సోవియట్ యూనియను, పాకిస్తాన్, ఇండియా, చైనా, ఇరాన్ దేశాల సరిహద్దుల్లో ఉన్న ఆఫ్గనిస్తాన్ రోజురోజుకూ అమెరికా గుత్త పెట్టుబడిదారుల చేతుల్లోకి పోతూఉంది.

'యునైటెడ్ స్టేట్సు న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్టు' అనే ఒక అమెరికా పత్రిక గత డిసెంబరులో ప్రచురించిన ఒక వ్యాసములో ఇలా ఉంది:

"రష్యా సరిహద్దులపై కొండలతో నిండి ఎగుడు-దిగుడుగా ఉండే యీ దేశంలో (ఆఫ్గనిస్తాన్‌లో) అమెరికా సాధించదలచిన ప్రయోజనమేమిటో చాలా విచిత్రంగా ఉంది. ఈ దేశములో అమెరికా కార్యకలాపాలు రోజురోజుకు ఎక్కువఅవుతున్నాయి. అమెరికా చర్యలను ఆఫ్గనిస్తాన్ ప్రభుత్వముకూడా బాహాటంగా బలపరుస్తూ ఉంది. అమెరికన్లు ఇప్పటికి ఆరు సంవత్సరాల పూర్వం మొట్టమొదట ఈ దేశంలో అడుగుబెట్టారు. అమెరికా రాయబారి అయిన ఇ. ఇ. పాల్మర్ ఆధ్వర్యాన అమెరికన్ల కార్యక్రమం కాబూల్ (ఆఫ్గనిస్తాన్ రాజధాని)లో నిర్విఘ్నంగా, నిర్విరామంగా కొనసాగిపోతూ ఉంది."

అమెరికన్లు సాగించే కార్యకలాపాలు కాబూలీలకు 'విచిత్రంగా' కనపడడమే కాదు, సందేహాలకుకూడా దారి తీస్తున్నాయి. ఆఫ్గనిస్తాన్ ప్రభుత్వం ప్రజలకు సంజాయిషి చెప్పుకోవలసివస్తోంది. ఆఫ్గనిస్తాన్‌లో అమెరికా సామ్రాజ్యవాద విధానాన్ని అమలు జరపడాన్నీ, అందుకు ఆఫ్గనిస్తాన్ ప్రభుత్వంకూడా ప్రోత్సాహమివ్వడాన్నీ కప్పిపుచ్చుతూ 'అనిస్' అనే ఒక పత్రిక 1949 ఫిబ్రవరి 8 వ తేదీన ఇలా వ్రాసింది.

"అమెరికాదేశం గానీ, మరేదేశం గానీ ఆఫ్గనిస్తాన్ వ్యవహారాల్లో తన పలుకుబడిని ఉపయోగించడంలేదు. అమెరికాతో వర్తక వ్యాపారాలు కొన

సాగించడంలోగానీ, నిర్మాణకృషిలో అమెరికా సహాయాన్ని తీసుకోడంలో గానీ ప్రత్యేకత ఏమీలేదు. ఇదంతా మామూలు విషయమే."

ఈ పత్రిక చెప్పినవిషయం యథార్థమేనా? ప్రపంచాధిపత్యంకోసం, ప్రపంచము అంతటా యుద్ధకీలకస్థానాలకోసం దేవులాడే అమెరికా సామ్రాజ్యవాదులు సౌమ్యంగా ఒక్క వ్యాపారం మాత్రమే చేసుకోడానికి ఆఫ్గనిస్తాన్ వచ్చారా?

ఆఫ్గనిస్థాన్‌కు అమెరికాచేసే ఎగుమతులు రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. నాసిరకానికిచెందిన పట్టూ, ఉన్నీ, నారు ఒకవరుసవాడి తీసివేసిన దుస్తులు ఇవేవారు అఫ్గనిస్తాన్‌కు ఎగుమతిచేసే వస్తువులు ఈ ఎగుమతులద్వారాచేతిపనులు, చేనేతపనులు చేసేవారి పరిస్థితి నానాటికి దిగజారిపోతూ ఉంది. వ్యవసాయ ముడిసరుకులనూ, ఉన్నినీ, ఆఫ్ఘనిస్తాన్‌లోవున్న తన ప్రతినిధులద్వారా అమెరికాయే కొనివేస్తుంది. ముడిసరుకుల్లోనూ, ఉన్నిలోనూ నూటికి 80 వంతులు నేడు అమెరికా గుత్తపెట్టుబడిదారుల స్వాధీనంలోనే ఉన్నాయి. ఈ విధంగా ఆఫ్గనిస్తాన్ ఆర్థిక జీవితమే అమెరికా చేతుల్లోకి పోయింది. అమెరికా వాళ్ళు తమయిష్టం వచ్చినట్లు ధరలను తగ్గించివేశారు. ఉన్నిధర సగటున 150 నుంచి 68కి పడిపోయింది.

ఆఫ్గనిస్తాన్ జాతీయ ఆదాయశాఖామంత్రి అబ్దుల్ మజీత్‌ఖాన్ తయారుచేసిన 'ఆర్థికప్రణాళిక'లో అమెరికా యుద్ధస్థానులకవసరమైన కీలక స్థానాలకూ, రోడ్లకూ, టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లకూ సర్వప్రాముఖ్యత ఇవ్వబడింది.

ఆఫ్గన్ రాజకీయ నాయకుల అమెరికా రాకపోకలు ఎక్కువఅయ్యాయి. ప్రధానమంత్రి సర్దార్ షా మహమూద్ ఖాన్ 1947 వ సంవత్సరం అమెరికాలో ఆరు మాసాలు గడిపాడు. 1948 లో ఆర్థికశాఖామంత్రి అయిన అబ్దుల్ మజీద్‌ఖాన్ వాషింగ్టన్‌కు వెళ్లాడు. మాజీ ప్రధాని మహమ్మద్ హాషింఖాన్ కూడా అనేకసార్లు అమెరికా యాత్ర చేశాడు. అమెరికానుంచికూడా ఇదే విధంగా ఆఫ్గనిస్తాన్‌లోకి రాజకీయ నాయకుల దిగుమతి జరుగుతూవుంది.

ఆఫ్గనిస్తాన్‌లోని నూనెగనులు అమెరికా వ్యాపారుల దృష్టిని అమితంగా ఆకర్షిస్తున్నాయి. సోవియటు సరిహద్దులపైనున్న హీరట్ నూనె గనులను దోపిడీ చేయడానికి ఇన్‌లేండ్ ఎక్స్‌ప్లోరేషన్ ఆయిల్ కంపెనీ ఆఫ్గనిస్తాన్ ప్రభుత్వంతో 1936 లో ఒక ఒడంబడిక చేసుకుంది. కాని తర్వాత 1938 లో ఈ ఒడంబడిక భగ్నమైపోయింది. అయినప్పటికీ అమెరికా తన ప్రయత్నాలను మాత్రం మానుకోలేదు. యుద్ధతంత్రరీత్యా ఆఫ్గనిస్తాన్‌కున్న ప్రాముఖ్యాన్నిబట్టి ఆదేశాన్ని అమెరికా సామ్రాజ్యవాదులు తమ చెప్పుచేతుల్లోనుంచి జారిపోనివ్వ దలచుకోలేదు. ఉత్తర ఆఫ్గనిస్తాన్‌లో తమకు కావలసిన సదుపాయాలకోసం ఎర్నెస్టు యఫ్. ఫాక్సు అనే ఒక అమెరికను (మిలటరీ ఎటాచీ) ద్వారా రాయబారాలు జరిపారు.

1949 ఫిబ్రవరి 1 వ తేదీన 'కియామే ఇరాన్' అనే టెహరాన్ పత్రికలో ప్రకటించిన ఈ క్రింది రిపోర్టునుబట్టి ఆఫ్గనిస్తాన్ ఏవిధంగా అమెరికాకు ఒక వలస దేశంగా మారిపోయిందో స్పష్టంగా బోధపడుతుంది.

"షిర్‌పుల్ నూనె గనుల్లోనూ, హీరట్‌కు పడమరగా కండహార్ (గాంధార) సమీపంలో దరినూర్ వద్దనున్న బంగారు వెండిగనుల్లోనూ, లోగర్ ప్రదేశంలో ఉన్న క్రోమియం గనుల్లోనూ పని కొనసాగించడానికి అమెరికన్ మారిసన్ క్నుడసన్ కంపెనీకి తగినన్ని సౌకర్యాలు సమకూర్చబడినాయి. ఆ ప్రాంతాల్లో అప్పుడే ఈకంపెనీ పనికూడా ప్రారంభించింది. ఆఫ్గనిస్తాన్‌లో రెండు విమానాశ్రయాలను నిర్మించుకోడానికికూడా ఈ కంపెనీతో ఒక ఒడంబడిక జరిగింది."

అమెరికన్ ప్రతినిధులు తెలియజేసిన సూచనలన్నిటినీ ఆఫ్గన్ ప్రభుత్వమూ, ఆఫ్గన్‌రాజు అయిన మొహమ్మద్ జహీర్ షాకూడా అంగీకరించినట్లు పైరిపోర్టులోనే ఉంది. ఆఫ్గనిస్తాన్‌లో విమానాశ్రయాలు నిర్మించడానికి అమెరికా ఎందుకింత ఆతురత చూపెడుతోంది? ఆఫ్గనిస్తాన్ ప్రభుత్వంతో ఒక ఒడంబడిక చేసుకొని ఆఫ్గన్ అమెరికన్ ఎయిర్‌వేస్ కంపెనీని స్థాపించాలని 1947లోనే ఒక నిర్ణయం జరిగింది. ఆఫ్గనిస్తాన్‌లో విమానాశ్రయాలు నిర్మించుకోడానికి, విమానాలు సప్లయి చేయడానికి అవసరమైన హక్కులన్నిటినీ అమెరికా ప్రభుత్వం ముందే రాబట్టింది. అమెరికానుంచి వైమానిక నిపుణులు దిగుమతి అవుతున్నారు.

ఆఫ్గన్ ప్రభుత్వానికి అమెరికా 25 కోట్ల డాలర్లను 'అప్పు'గా పెట్టబోతోందని పత్రికావార్తలు తెలియజేస్తున్నాయి. సోవియట్ సరిహద్దుల్లోను, ఇండియా సరిహద్దుల్లోనూ యుద్ధతంత్రానికి ఉపయోగించే రోడ్లకోసమై ఈ 'అప్పు'ను వినియోగించవలసిందిగా అమెరికా పట్టుబడుతుందని 'కియామే ఇరాన్' అనే టెహరాన్ పత్రిక ప్రకటించింది. 300 మంది అమెరికా సాంకేతిక నిపుణులూ ఇంజనీర్ల పర్యవేక్షణక్రింద ఈ రోడ్ల నిర్మాణ కార్యక్రమం సాగించబడుతుంది. తన దురాక్రమణోద్దేశాన్ని సాధించుకోడానికి ఆఫ్గన్ ప్రభుత్వాన్ని అమెరికా తన చేతిలో ఒక కీలుబొమ్మలాగా ఆడిస్తోంది. కండహార్ నుంచి 'చమన్'కూ, కాబూల్‌నుంచి జలాలాబాద్‌కూ వేస్తోన్న రోడ్ల నిర్మాణంపై పర్యవేక్షణ చేయడానికి 250మంది అమెరికన్లు నియోగించబడినారు.

అమెరికా గుత్త పెట్టుబడిదారులు తమ రాజకీయ, సైనిక ఉద్దేశాలను సాధించుకోడంకోసం సరూబీ వద్దనున్న హైడ్రో ఎలెక్ట్రిక్ స్టేషన్నూ, కాబూల్ వద్దనున్న ఆనకట్టనూ హెల్మాండ్ నదిలోని ఇర్రిగేషన్ కాలవనూ తమ స్వాధీనంలో అట్టిపెట్టుకున్నారు.

హెల్మాండ్‌నది ఇరాన్ సరిహద్దుల గూండా ప్రవహిస్తుంది. ఈ నదిలోనుంచే ఇరాన్‌లోని సీస్తాన్ ప్రదేశమంతటికి నీటిపారుదల సౌకర్యాలు కలిగించబడ్డాయి. ఇప్పుడీనదిపై అమెరికనుల ఆధిపత్యం

ఏర్పడిన ఫలితంగా ఇరాన్‌లోని నీటి పారుదల దెబ్బతినిపోయింది. ఇరాన్‌లో కరువు పరిస్థితులు ఏర్పడ్డాయి. అమెరికన్ ఇంజనీర్లు ఆఫ్ఘనిస్తాన్‌కు సప్లయి అయ్యే నీటిని కూడా 'రేషన్' చేయడంవల్ల ఆఫ్ఘన్ పరిస్థితి మరింత అధ్వాన్నమయింది.

వెనకబడిన ప్రజలకు సహాయంచేయడం అనే పేరుతో అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆయా దేశాలను తమ గుప్పెట్లో పెట్టుకుంటున్నారు. అమెరికా జోక్యం కలిగించుకున్న దాని ఫలితంగానే ఆఫ్ఘనిస్తాన్ ఇరాన్ దేశాలమధ్య నున్న తగాదాలు తగ్గకుండా రగుల్కొంటూనే ఉన్నాయి. ఒకప్పుడు ఆఫ్ఘనిస్తాన్ వైపు మొగ్గుతూ, మరొకప్పుడు ఇరాన్ వైపు మొగ్గుతూ 'పిల్లులూ-రొట్టెముక్క' కథలోని కోతిలాగా అమెరికా ప్రభుత్వం వ్యవహరిస్తూఉంది.

ఆఫ్ఘనిస్తాన్‌ను దోపిడీచేయడంలో అమెరికా బ్రిటిష్ ప్రభుత్వాలమధ్య కొంత పోటీకూడాఉంది. ఆఫ్ఘనిస్తాన్‌కు ఆనుకొని ఉన్న పాకిస్తాన్ సహాయంతో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ ప్రయోజనాలను సురక్షితంగా కాపాడుకోవాలని చూస్తున్నారు. ఆఫ్ఘన్ ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చి తద్వారా ఆఫ్ఘన్‌సరుకులు త్వరగా ఎగుమతి కాకుండా సరిహద్దులోనే వాటిని అట్టిపెడుతున్నారు. ఈ విధంగా ఒత్తిడిచేసి ఆఫ్ఘన్ ప్రభుత్వంనుంచి తమకు అవసరమైన సదుపాయాలనూ, సౌకర్యాలనూ రాబట్టుకుంటున్నారు. ఇండియా కంపెనీలోని ఆంగ్లో - ఇండియన్ ఇంజనీర్లు ఆఫ్ఘనిస్థాన్‌లోని తూర్పు ప్రాంతంలోనూ, కాబూల్ ప్రాంతంలోనూ కట్టడపు పనులకు సంబంధించిన ఒక పెద్ద 'కంట్రాక్టు' పుచ్చుకున్నారు.

ఆఫ్ఘనిస్థాన్ విమానసర్వీస్ విషయంలో కూడా బ్రిటిష్, అమెరికా సామ్రాజ్యవాదులమధ్య పోటీ జరుగుతూనే ఉంది. కాబూల్‌నుంచి పెషావరుకూ, కండహార్ నుంచి కరాచీకీ విమానసర్వీసు ఏర్పరచడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఆఫ్ఘన్ ప్రభుత్వంతో ఒక ఒడంబడిక చేసుకుంది. ఈ ఒడంబడికలో ప్రధానపాత్ర వహించింది ఒక ఇండియన్ డెలిగేషనే అనేవిషయం ముఖ్యంగా గుర్తుంచుకోవలసి ఉంటుంది.

ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆఫ్ఘన్ సైన్యాన్ని గురించి చాలా ఎక్కువ శ్రద్ధవహిస్తున్నారు. విమానాలు వగైరా మిలటరీ సామగ్రిని బ్రిటిషు ప్రభుత్వము ఆఫ్ఘనిస్తాన్‌కు సప్లయిచేస్తూ ఉందనీ ఇండియాలో ఆఫ్ఘన్ సైనికాధికారులకు తర్ఫీదు ఇవ్వబడుతోందనీ 'డెయిలీ మెయిల్' అనే పత్రిక 1946 లోనే ఒక రిపోర్టు ప్రకటించింది.

ఆఫ్ఘన్ సరిహద్దులకు ఆనుకొని ఉన్న పాకిస్తాన్ సరిహద్దులపై బ్రిటిష్ ప్రభుత్వం సైనికకేంద్రాలను నిర్మిస్తూ ఉంది. ఇలాంటి చర్యలు బ్రిటిషు డొమినియన్ సరిహద్దుల్లో ఉన్న పఠానులకూ, ఆఫ్ఘనులకూ మధ్య విభేదాలను ఇంకా రెచ్చగొడతాయి.

ఆఫ్ఘన్ జీవితంలోని వివిధశాఖలన్నింటిలో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులఅధికారం స్పష్టంగాకనబడుతుంది. ప్రాథమిక పాఠశాలలనుంచి ఉన్నత కళాశాలలవరకూ ఇంగ్లీషు నేర్పబడుతూ ఉంది. ఈ విద్యాసంస్థల్లో అనేకమంది అమెరికన్లు ఉపాధ్యాయులుగా పని చేస్తున్నారు. కాబూల్‌లోని హబీబియా కాలేజి అంతా అమెరికన్లతో నింపివేయబడింది. ఈ కాలేజీలో చదువు

కున్న విద్యార్థులను ఉన్నత విద్యకై అమెరికాకు పంపిస్తూ ఉన్నారు. ఈ విద్యార్థులకే ఆఫ్గనిస్తాన్‌లో పెద్ద పెద్ద ఉద్యోగాలు యివ్వబడుతున్నాయి. అమెరికా సినిమాలు ఆఫ్గనిస్తాన్‌లో విరివిగా చూపబడుతున్నాయి. బ్రిటిషు అమెరికా సామ్రాజ్యవాదుల వార్తాసంస్థలయిన 'అసోసియేటెడ్ ప్రెస్' 'రాయిటర్'లు వ్యాపింపజేసేటప్పుడు వార్తలతో పత్రికలు నింపివేయ బడుతున్నాయి. 'డాలర్' దేవతకూ, అటంబాంబు మహాశక్తికీ హారతులు పడుతున్నాయి.

మారిసన్ క్నుడ్‌సన్ కంపెనీ ఆఫ్గనిస్తాన్ ఆర్థిక జీవితంలో ప్రధాన పాత్ర నిర్వహిస్తూఉంది. ఇంగ్లీషు మాట్లాడే ఆఫ్గనులను ఉద్యోగులుగా చేర్చుకుంటూంది. వారిని అమెరికా ఏజెంట్లుగా తయారుచేస్తోంది. అమెరికా పెట్టుబడిదారులు దేవతా సమానులనే భావాల్ని నూరిపోస్తోంది. ఇలాంటి కంపెనీలే ఇంకా చాలా ఉన్నాయి. అమెరికానుంచి వ్యవసాయ శాస్త్రజ్ఞులూ, ఉపాధ్యాయులూ, సైనిక శిక్షకులూ, ఇంజనీర్లూ ఎడతెగకుండా ఆఫ్గనిస్తాన్‌కు దిగుమతి అవుతూనేఉన్నారు. ఆఫ్గన్ మంత్రివర్గంలోని గనులూ, జాతీయ ఆదాయం, వ్యవసాయం, ఆర్థిక, విద్య వగైరా శాఖల మంత్రులకు అమెరికన్లే 'సలహాదారులు'గా పనిచేస్తున్నారు.

ఆఫ్గనిస్తాన్‌లో అమెరికా సామ్రాజ్యవాదుల కార్యకలాపాలు ఏ విధంగా రోజు రోజుకూ ఎక్కువ అవుతూ ఉన్నాయో 1948 సెప్టెంబరు 22వ తేదీన 'రజమ్' అనే ఇరాన్ పత్రిక ఇలా ప్రకటించింది!

**"పునర్నిర్మాణమూ, 'అభివృద్ధి కార్యక్రమమూ మొదలైన పేరులతో డాలరు రాజకీయనాయకులు ఆఫ్గన్ పరిపాలకుల నడ్డం పెట్టుకొని మారిసన్ క్నుడ్‌సన్ కంపెనీలాంటి కంపెనీల ద్వారా ఆఫ్గనిస్తాన్ ఆర్థిక జీవితాన్ని అమెరికాతో ముడిబెట్టారు ఆర్థిక విషయాలకు మాత్రమే సంబంధించి ఈ కంపెనీలు పనిచేస్తున్నాయి అని పైకి ప్రకటించినా అమెరికా సామ్రాజ్యవాదులరాజకీయప్రయోజనాలను సాధించడమే వాటి అసలు ఉద్దేశం"**

ప్రపంచాధిపత్యంకోసం అమెరికా వేసే ప్లానులలో వాటి కనుకూలంగా ఆఫ్గనిస్తాన్‌నుకూడా ఒక మిలటరీ కేంద్రంగా తయారుచేయడమే అమెరికా సామ్రాజ్యవాదుల అసలు ఉద్దేశం. అమెరికాకు పదివేల కిలోమీటర్ల దూరాన ఉన్న ఆఫ్గనిస్తాన్‌ను ఒక మిలటరీ కేంద్రంగా తయారుచేయడం అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణ వాంఛకూ, సామ్రాజ్య విస్తరణ కాంక్షకూ ఒక చక్కటి నిదర్శనం. ఆఫ్గనిస్తాన్ అమెరికా మిలటరీ కేంద్రంగా తయారుకావడం ఆఫ్గనిస్తాను భవిష్యత్తుకే ముప్పు తెచ్చిపెడుతుంది.

—'న్యూటైమ్సు'నుండి
(30-3-49)

## శాంతిస్వాతంత్ర్యాలకు ఆగర్భశత్రువు

# అట్లాంటిక్ ఒడంబడిక

బ్రస్సెల్సు, బ్రిటను, ఫ్రాన్సు బెల్జియం, హాలెండు, లగ్జెంబర్గ్ దేశాలు పరస్పర సహకారానికీ, సమిష్టి రక్షణకూ, 1949 మార్చిలో ఒక ఒడంబడిక చేసుకున్నాయి. ఈ ఒడంబడికద్వారా 'పశ్చిమ యూనియన్' అనే పేరుతో పశ్చిమ యూరపు రాజ్యాలు ఒక ప్రత్యేక ముఠాగా ఏర్పడ్డాయి. బ్రిటన్ ఆధ్వర్యాన ఏర్పడిన పశ్చిమ యూనియన్‌లో ఆదేశాల ననుసరించే మరికొన్ని దేశాలుకూడా చేరబోతున్నాయని తెలుస్తోంది. ఈ పశ్చిమ యూనియను నిర్మాతలు మొట్టమొదటినుంచీ సోవియట్ యూనియన్‌గానీ ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలుగానీ ఈ యూనియన్‌లో పాల్గొనకుండా ఉండేటట్లు చేశారు. దీన్నిబట్టే ఈయూనియన్ నిర్మాతల అసలు ఉద్దేశమేమిటో స్పష్టంగా తెలుసుకోవచ్చు. యూరపులో శాంతినభిలషించే దేశాల నైక్యపరచడంగానీ, శాంతిని కాపాడడంగానీ, వారి యుద్దేశంకాదు. వారిఅసలు ఉద్దేశం వేరే ఉంది.

ఈ ఒడంబడికలో సంతకాలు చేసిన దేశాల్లో ఆర్థిక సౌష్టవం కలిగించేందుకు మాత్రమే ఈ అట్లాంటిక్ సంధి ఉద్దేశించబడింది అని పైకి చెప్పుతున్నా దాని నిజస్వరూపం నగ్నంగా ఇప్పుడందరికీ కన్పిస్తూనే ఉన్నది. ఆ దేశాల్లో దినదినాభివృద్ధి చెందుతూన్న కార్మికవర్గ శక్తినీ, ప్రజాస్వామికోద్యమాన్నీ పశుబలంతో అణచివేయడంతోపాటు వలస దేశ ప్రజల స్వాతంత్ర్యోద్యమాలనుకూడా నెత్తురుటేరుల్లో ముంచెత్తడమే అట్లాంటిక్ సంధిలోనిఅంతరార్థం. వలసదేశాల్లో తమ నిరంకుశ విధానాన్నీ, దోపిడిని చిరకాలం కొనసాగించుకోడానికి ఈ మిలటరీ పొలిటికల్ గ్రూపును-పశ్చిమ యూనియనును-సామ్రాజ్యవాదులు ఒక సాధనంగా ఉపయోగించుకో జూస్తున్నారు. పశ్చిమ యూనియనుయొక్క ప్రజాస్వామిక వ్యతిరేక స్వభావం అభివృద్ధినిరోధకతత్వం దురాక్రమణోద్దేశమూ ఆయాదేశాల సామ్రాజ్యవాద తత్వాన్ని మరింత స్పష్టపరుస్తున్నాయి.

ప్రపంచమంతటా తమ అధికారాన్ని నిలబెట్టుకోడానికి ఆంగ్లో - అమెరికా సామ్రాజ్యవాదులు వేసే ప్లానులో ఈ 'పశ్చిమ యూనియన్' నిర్మాణం ఒక భాగం మాత్రమే. పశ్చిమ యూరప్‌లో ఉన్న ఆంగ్లో-అమెరికా సామ్రాజ్యవాదుల ఏజెంట్లముఠాయే ఈ పశ్చిమ

రాజ్యాల యూనియన్. ఈ 'యూని యన్'లో బ్రిటను ప్రధానస్థానం ఆక్ర మిస్తూ ఉంది. అమెరికా పాలకవర్గాలు తమ పలుకుబడి నుపయోగించి ఈ యూని యన్‌ను తమ చిత్తం వచ్చినట్లు - తమ చెప్పుచేతల్లో - నడిపిస్తాయి.

ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా మధ్యకూడా 'రియోడీజనేరో' సమా వేశంలో ఒక ఒడంబడిక జరిగిందనే విష యాన్ని మరచిపోరాదు. ఈ దేశాలపై అమెరికా తన పలుకుబడి నుపయోగించ డానికి ఈ ఒడంబడిక ఒక సాధనగా ఉపయోగిస్తుంది.

పశ్చిమ యూనియన్‌ను ఏర్పరచడం, అమెరికాదేశాల మధ్య ఒడంబడిక జరగ డం - ఈ రెండు సంఘటనలు ఇక ముందు అమెరికా ప్రపంచరంగంలో ఎలాంటి విధానం అవలంబించబోతూ ఉందో స్పష్టం చేస్తున్నాయి. అమెరికా అవలంబించబోయే కార్యక్రమానికి ఈ రెండూ మచ్చుతునకల్లాంటివి. ఉత్తర అట్లాంటిక్ కూటమిని ఏర్పరచడంలో అమెరికా పాలకవర్గాలే మొదటినుంచీ ప్రధానపాత్ర వహించాయి.

ఉత్తర అట్లాంటిక్ సంధిని ఆయా దేశాల రక్షణకు సంబంధించిన సమస్యగా అమెరికా ప్రభుత్వం చిత్రిస్తూఉంది. మిత్రరాజ్య సమితి కార్యక్రమంకొనసాగ కుండా సోవియట్ 'అడ్డుపుల్లలు' వేసే విధానం అవలంబిస్తూందనీ, మిత్రరాజ్య సమితి బలపడిందాకా వేచియుండకుండా ప్రబలమైన శక్తి సామర్థ్యాలతో ప్రమాదకరంగా పరిణమించిన సోవియట్ దురాక్రమణను ఎదుర్కోడానికి ఈ ఒడంబడిక అవసరం అయిందనీ అమెరికా సామ్రాజ్యవాదులు ప్రచారం చేస్తున్నారు.

ఉత్తర అట్లాంటిక్ సంధిలో యూరప్ లోని అయిదుదేశాలు భాగస్వాములుగా ఉన్నప్పటికీ అమెరికా కెనడాలే దానికి ఆయువుపట్టులాంటివి. అట్లాంటిక్ కూట మిపై అమెరికాదే సర్వాధికారం అనే విషయం జగద్విదితమే. యూరోప్‌లోని పెట్టుబడిదారీ దేశాల్లో ప్రధానదేశమైన బ్రిటన్‌కు అమెరికాతో పొత్తుకలుస్తోంది. అంటే అట్లాంటిక్ సముద్రంయొక్క 'ఉభ యతీరాలపై' అధికారాన్ని చేపట్టడం ద్వారా-అట్లాంటిక్ ఒడంబడికను ప్రధాన సాధనంగా ఉపయోగించుకొని - తమ ప్రధానాశయం అయిన ప్రపంచాధి పత్యాన్ని సాధించాలని ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు.

స్వీడెన్, నార్వే, డెన్మార్క్‌లాంటి దేశాలనుకూడా ఈ ఒడంబడికలో భాగ స్వాములుగా చేర్చాలనీ వాళ్ళు ప్రయత్ని స్తూన్నారు. లేక ఈ దేశాలమధ్య ఒక ప్రత్యేకసంధి - స్కేండినేవియన్ సంధి - జరగబోతూందని మరికొందరు సూచిస్తు న్నారు. ఏవిధంగానైనాసరే ఈ దేశా లనుకూడా పూర్తిగా తమగుప్పెట్లో ఉంచు కోడమే సామ్రాజ్యవాదుల ఆశయం.

ఫ్రాంకో స్పెయిన్, పోర్చుగల్, ఇటలీ, చివరకు టర్కీనికూడా ఈ ఒడం బడికలో చేర్చాలని సామ్రాజ్యవాదుల ముఠాలో గుసగుసలు జరుగుతూన్నట్లు తెలుస్తోంది. ఇదే విధంగా మెడిటరేని యన్ ఒడంబడిక లేక తూర్పు మెడిటరేని యన్ సంధికోసం కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఇండోనేషియా సమస్యను చర్చిం చాలనే సాకుపై ఇటీవల ఢిల్లీలో జరిగిన సమావేశంలో ఆగ్నేయ ఆసియా దేశా

లన్నీ కలిసి ఒక గ్రూపుగా ఏర్పడాలనే ఆలోచనలుజరిగాయి.

ఈ ఒడంబడికలూ, ఈ సంధులూ, ఈ ముఠాలూ ఏమి తెలియజేస్తున్నాయి? ప్రత్యక్ష పద్ధతులద్వారాగానీ లేక పరోక్ష పద్ధతులద్వారాగానీ సాధ్యమైనన్ని ఎక్కువ దేశాలను కలిపి ముఠాలుగా ఏర్పరచి వాటిని తమ అధీనంలో ఉంచుకోవడమే అమెరికా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఆశయం. తమ ఆశయాన్ని సాధించుకోడంకోసం ఎలాంటి నీచ పద్ధతులకైనా ఒడిగట్టడానికి వాళ్ళు సిద్ధపడుతున్నారు. ఆయా దేశాలపై ఆర్థికంగా ఒత్తిడి తెస్తున్నారు. ఆర్థిక పరిస్థితులను చక్కపరుస్తాం అనే ఆశలు చూపెట్టి 'డాలర్ పాలసీ' ఫలితంగా ఆయాదేశాలను ఆర్థికంగా మరింత క్రుంగదీస్తున్నారు. సోవియట్ 'దురాక్రమణ' అనే లేని భూతాన్ని చూపి తమ అసలు ఉద్దేశాన్ని - తాము సాగించే దురాక్రమణను— మరుగు పరుచుస్తున్నారు. చిన్న దేశాలపై సాధ్యమైనంత ఎక్కువ ఒత్తిడి తెస్తున్నారు.

ఈ ఒడంబడికలన్నిటి వెనుక ఇమిడి ఉన్న అసలు రహస్యం ఒకటే ఉంది. ఈ ఒడంబడికలలో సోవియట్ యూనియన్‌కుగానీ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలకుగానీ చేరే అవకాశం లేకుండా చేయడమే. అసలు ఈ ఒడంబడికలన్నీ మొదటినుంచీ సోవియట్ యూనియన్‌కూ ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలకూ వ్యతిరేక కార్యక్రమం జరపడానికి ఉద్దేశించినవే. అట్లాంటిక్ ఒడంబడికే యిందుకు ఉదాహరణ.

ఈ ఒడంబడిక ఫలితంగా ఆయా దేశాలు విదేశవ్యవహారాల్లో స్వతంత్ర పాలసీ నవలంబించలేకపోవడం, స్వదేశ వ్యవహారాల్లో ప్రజాస్వామిక విధానానికి స్వస్తిచెప్పడం, అమెరికా గీసిన గీతను దాటకపోవడం జరుగుతుంది. అమెరికా బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఆ దేశాలను ప్రపంచాధిపత్యంకోసం తాము చేసే దురాక్రమణప్లానులో పావుల్లాగా ఉపయోగించుకుంటారు. కాబట్టి ఇలాంటి ప్లానులను కొనసాగించడంకోసం ఏర్పడే కూటముల్లో - అట్లాంటిక్ సంధిలాంటి ఒడంబడికలో సోవియట్ యూనియన్ గానీ తదితర ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలుగానీ చేరడమనే సమస్యేలేదు.

అమెరికా ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, బ్రిటిష్ విదేశాంగశాఖా కార్యాలయాల్లోను కూర్చొని ప్లానులు వేయడం ముఠాలు కట్టడం కాగితాలమీద సంతకాలు చేయడం జరిగినంత తేలికగా వాటిని ఆచరణలోపెట్టడం సాధ్యంకాదనే విషయాన్ని ఈ ముఠాపెద్దలు గుర్తుంచుకోవలసి ఉంటుంది. కాగితాలమీద సంతకాలు పెట్టినంతమాత్రాన ఆయా దేశాల మధ్యనున్న పరస్పర వైరుధ్యాలు అదృశ్యమైపోవు. ఈ ముఠాపెద్దలైన అమెరికా బ్రిటన్‌ల మధ్యనే దురాక్రమణ ప్లానుల్లో అనేక పరస్పర స్పర్థలున్నాయి. కాగితాలమీద సంతకాలుపెట్టినంత తేలికగా ఆస్పర్థలూ, వైరుధ్యాలూ మటుమాయమైపోవు. ప్రతిచిన్న విషయంలోనూ - అడుగడుగునా - ఈ రెండుదేశాలు పరస్పరం పోటీపడుతూనే ఉన్నాయి.

ఈ ఒడంబడికల్లో చేరడానికి అన్ని దేశాలూ సిద్ధంగాలేవనే విషయాన్ని కూడా మరచిపోరాదు. ఒడంబడికలో ఇదివరకు చేరిన దేశాలన్నీ ఆంగ్లో - అమెరికను సామ్రాజ్యవాదుల ఆజ్ఞలన్నిటినీ కిక్కురు

మనకుండా శిరసావహిస్తాయనుకోవడం కూడా పొరపాటు.

తూర్పుదేశాల్లో ఇటీవల బ్రహ్మాండముగా విజృంభిస్తోన్న జాతీయ విముక్తి ఉద్యమాలనూ, వాటిబలాన్నీ నిర్లక్ష్యం చేయడం సాధ్యంకాదనే విషయాన్ని గూడా ఈ ముఠా పెద్దలు జ్ఞాపకం ఉంచుకుంటేమంచిది.

సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలూ నిజమైన ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబిస్తున్నాయనీ వివిధ జాతుల మధ్యపరస్పర సౌహార్దమూ సమానత్వమూ అనే మహోన్నత సిద్ధాంతాలను అవి పూర్తిగాఅమలు పరుస్తున్నాయనీ మరచిపోరాదు.

సోవియట్ యూనియనుయొక్క అస్తిత్వమే-ఉనికియే-సామ్రాజ్య వాదుల దురాక్రమణ ప్లానులకు గొప్ప ప్రతిబంధకం. పైగా సోవియట్ బలం నానాటికీ పెంపొందుతూవుంది. దాని అంతర్జాతీయ ప్రతిష్ఠ యినుమడిస్తూవుంది. వివిధ దేశాలల్లో వున్న ప్రజాస్వామిక శక్తులు దానికిపూర్తిగా అండగా నిలుస్తున్నాయి. కాబట్టి సామ్రాజ్యవాదుల గొంతెమ్మ కోరికలు విఫలంకాక తప్పదు. గత యుద్ధంలో ఫాసిస్టు ప్రభుత్వాలను నాశనము చేసినప్పుడు చరిత్రయే ఈసత్యాన్ని రుజువుచేసింది. ఫాసిస్టులుకూడా ఇదే విధంగా ప్రపంచాధిపత్యంకోసం కలలుగన్నారు. పతనమయ్యారు. ఆఫాసిస్టుల అడుగుజాడల్లోనే నడుస్తూన్న ఆంగ్లో అమెరికను సామ్రాజ్యవాదులకుగూడా అదేగతిపడుతుంది.

('యంగ్ గార్డు' (మార్చి 1949) పత్రికలోని సోవియట్ విదేశాంగశాఖా మంత్రి వర్గం చేసిన ప్రకటననుండి)



## ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో

# ఆంగ్లో - అమెరికన్ రాయబారుల కుటిల రాజనీతి

రాయబారులు నిర్వర్తించవలసిన బాధ్యతలను గురించి ఎవరినిప్రశ్నించినా ఎలాంటి సందేహంలేకుండా యీ క్రింది సమాధానం మీకు వస్తుంది : 'విదేశాలలోని రాయబారులు అక్కడ శాంతియుత మార్గాలద్వారా తమ దేశం యొక్క జాతీయ ప్రయోజనాలనుకాపాడుకుంటూ తన దేశానికీ, తనప్రజలకూ, ఆదేశానికీ, ఆప్రజలకూ మధ్య స్నేహపూర్వకమైన సంబంధాలను నెలకొల్పేందుకు శ్రద్ధ తీసుకొని విధిగా కృషిచేయాలి. ఇది ప్రతి రాయబారీ నిర్వర్తించవలసిన ప్రధాన బాధ్యత.'

కాని నేటి ఆధునిక ప్రపంచంలో ప్రముఖపాత్ర నిర్వహించుచున్న బ్రిటన్, అమెరికాల రాయబారులు యితర దేశాలలో ఏమి చేస్తున్నారో పరిశీలించే వారికెవరికైనా ఒక విషయం స్పష్టంగా బోధపడుతుంది. అదేమంటే వారు పైన నిర్వచించిన ఆశయాలకోసం కృషి చేయడంలేదని తేటతెల్లమవుతుంది. వారు కాపాడేది బ్రిటన్, అమెరికాల జాతీయ ప్రయోజనాలను కాదు, ప్రపంచాధిపత్యంకోసం అర్రులుజాస్తున్న తమ దేశాలలోని గుత్తపెట్టుబడిదారుల స్వప్రయోజనాలను. వారు బ్రిటిషు, అమెరికన్ ప్రజల శ్రేయస్సుకోసం పనిచేయడం లేదు. మీదు మిక్కిలి తమదేశాలలోని అభివృద్ధి నిరోధక ముఠాలకు సేవచేస్తున్నారు. వారు వివిధదేశాల మధ్య స్నేహపూరితమైన సంబంధాలను ప్రోత్సహించడానికి బదులు దేశాల మధ్య వైరుధ్యాలనూ, అంతర్జాతీయ తగాయిదాలను రెచ్చగొడుతున్నారు. ఈ విధమైన వింత వైఖరి ముఖ్యంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో వుంటున్న ఆంగ్లో - శాక్జన్ (ఇంగ్లీషు భాషను మాట్లాడే జాతులు) ప్రభుత్వాల రాయబార ప్రతినిధుల ప్రవర్తనలో స్పష్టంగా ప్రదర్శితమౌతున్నది.

మార్చిమాసం ప్రారంభంలో లండను "ఎకానమిస్టు" పత్రిక తూర్పుయూరప్ దేశాలలోని బ్రిటిష్ అమెరికనుల రహస్య కార్యకలాపాలను గురించి ఒక వ్యాసాన్ని ప్రకటించింది. అందులో "కొంతమంది అమెరికన్, బ్రిటిష్ ఆఫీసర్లకు బొడ్డులో

కత్తిపెట్టుకొని వెళ్లే బుద్ధులున్నా"యని ఒక ముఖ్యవిషయాన్ని ఒప్పుకోక తప్ప లేదు. బయటకు బాగానే నటించుతూ లోపల బొడ్డులో కత్తిని పెట్టుకొనేబుద్ధి కుట్రదారులదీ, రహస్యంగా ఖూనీచేసే హంతకులదీ అన్నది అందరికీ తెలిసిన విషయమే. ఈ బుద్ధినే ఆంగ్లో - అమెరికాల విదేశ రాజనీతికి అన్వయించి చూస్తే అతి నీచమైన గూఢచారి పని చేయడం. అక్రమకార్యాలకు పూనుకోవడము, విధ్వంసక కార్యక్రమాలను ప్రోత్సహించడం అవుతుంది. అయినా ఒక దేశ రాయబారి యిలాంటి తప్పుడు పనులు చేయడంలో లండను గుత్తవ్యాపారుల పత్రికకు సిగ్గుపడవలసిన విషయమేమీ కనపటంలేదు. పైపెచ్చు దానిని సహజ గుణంగానే భావించింది. రాయబార కార్యాలయంలోని గూఢచారులూ, విధ్వంసకారులను గురించి మాత్రమే అది కొంత బాధపడింది.

నిజానికి గత రెండుమూడు సంవత్సరాలుగా ఏదోఒక ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యంలో ఆంగ్లో-అమెరికన్ రాయబారుల గూఢచారి కార్యక్రమాలు ఖచ్చితంగా బయపడుతునే ఉన్నాయి. ఈ విధంగా బట్టబయలు అయిన ప్రతి సంఘటనలోనూ అమెరికా బ్రిటన్ రాయబారి కార్యాలయాలు "బొడ్డులో కత్తిని పెట్టుకొనే రకంగానే" స్పష్టంగా బయటపడ్డాయి. ప్రపంచాధిపత్యంకోసం అర్రులు జాస్తున్న యీ రాజ్యాలు తమ గూఢచారి విధానమూ విధ్వంసక, అక్రమచర్యలనూ మునుముందుగా సోవియట్ యూనియన్‌కూ ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలకూ వ్యతిరేకంగా ప్రయోగించుతున్నాయి. ఈ ముప్పై సంవత్సరాలలో సామ్రాజ్యవాద ఏజెంట్ల కుట్రలతో సోవియట్ యూనియన్‌కు బాగా అనుభవముంది. ఈ రకమైన అనుభవాన్నే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలుకూడా నేడుపొందుతున్నాయి.

## ఆంగ్లో - అమెరికన్ రాయబారుల నీచప్రవర్తన

పెట్టుబడిదారీ విధానాన్నుండి బయటపడి సామ్రాజ్యవాదుల దోపిడీనుండి విముక్తిపొందిన యీ ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలపై అమెరికా బ్రిటన్‌లు "ఆయుధ ప్రయోగంలేని యుద్ధాన్ని" (కోల్డువార్) కొనసాగించు తున్నాయి. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు మధ్య, ఆగ్నేయ యూరపుల్లో తాము కోల్పోయిన రాజకీయ, ఆర్థిక కీలకస్థానాలనుతిరిగి సంపాదించుకోనేందుకు ఎంతటి నీచపు కార్యక్రమానికైనా దిగుతున్నారు.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలోని ఆంగ్లో- అమెరికన్ రాయబార ప్రతినిధుల ఆశయం ఆ దేశాలతో మామూలు వాణిజ్య స్నేహసంబంధాలు ఏర్పరచుకోవడంకానేకాదు. అక్కడున్న ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థలను కొంచెపరచడమే తమపరమోద్దేశ్యంగా పెట్టుకొన్నారు. ఇప్పటికి జరిగిన దానినిబట్టిచూస్తే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలోని బ్రిటిష్ అమెరికన్ రాయబారుల అధికార కార్యకలాపాల వెనుక పెద్దఎత్తున కుట్ర కార్యాకలాపాలను కొనసాగించుతునట్లు కనపడుతున్నది. ఈ కుట్రల స్వభావం సంగ్రహంలో యీక్రిందివిధంగా ఉంది.

**—ఒకటి: ప్రభుత్వాలకు వ్యతిరేకంగా కుట్రలను పన్నడం, అందు**

కోసం ఫాసిస్టులతోసహా అభివృద్ధి నిరోధక, ప్రజావ్యతిరేక శక్తులకూ, రాజకీయ రంగంనుండి సెలవు పుచ్చుకొన్న బూర్జువా పార్టీల నాయకులకూ, ముఖ్యంగా మితవాద సోషలిస్టులకూ అవసరమైన సహాయంచేయడం.

—రెండు: ఇదివరకు హిట్లర్ ఏజంట్లుగా పనిచేసినవారితోసహా యీ అభివృద్ధి నిరోధకశక్తులన్నింటినీ గూఢచారులుగానూ, రహస్య కార్యకలాపాలలో సాధనాలుగాను విరివిగా వినియోగించడం.

—మూడు: ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల ఆర్థికాభివృద్ధికి ఆటంకాలను కలుగజేయడానికీ, ఆదేశాల రక్షణశక్తిని కొంచెపరచడానికీ, ఆంతరంగిక అసంతృప్తిని రెచ్చగొట్టడానికి, ఆ విధంగా ప్రజాతంత్ర సంస్కరణలు కొనసాగకుండా చూడటానికీ విధ్వంసక కార్యాలను జరపడం, కుట్రలను పన్నడం, బీభత్సాన్ని కలుగజేయడం.

—నాలుగు: యుద్ధ వాతావరణాన్ని వ్యాపింపజేయడానికి ప్రయత్నించడం, యుద్ధం తప్పదనే అదేపనిగా ప్రచారంచేసి, భీతిని ప్రజలలో కలుగజేయడం, ఎప్పుడూ ఏదో జరుగుతుందనే భయవాతావరణాన్ని ప్రజలలో వ్యాపింపజేసి, వారిని మానసికంగా కల్లోల పరిస్థితులలో వుంచడానికి ప్రయత్నించడం.

ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాల్లో కుట్రదారులను, గూఢచారులనూ, విధ్వంసకారులనూ, ఖూనీకోరులనూ పట్టుకొని విచారణచేయడంలో యీ సంగతులన్నీ ప్రత్యక్షంగా బయటపడ్డాయి.

ఆ విధంగా జరిగిన సంఘటనలలో కొన్నింటిని జ్ఞప్తికి తెస్తాను.

## హంగరీలో మిండ్సజంటీ కధనం

ఈ యేడాది ఫిబ్రవరిమాసంలో హంగెరీలో జరిగిన మిండ్సజంటీ విచారణను తీసుకొందాం. కార్డినల మిండ్సజంటీ పోప్ (క్రైస్తవ మతగురువు)కు అధికార రీత్యా ప్రతినిధి. అయినప్పటికీ అతడు కుట్రకార్యకలాపాలలో పాల్గొన్నాడు. ఇతడు హంగరీలో హాప్సబర్గ రాచరికాన్ని తిరిగి నెలకొల్పడానికి హంగరీ రిపబ్లిక్‌ను కూలద్రోయడానికి జరిగిన కుట్రకుప్రధాన నాయకుడుగా వ్యవహరించాడు. ఇదంతా హంగరీలోవున్న అమెరికా రాయబారి ప్రత్యక్ష సహాయ సంప్రదింపులతో జరిగింది. బుడాపెస్టులోని అమెరికా రాయబారి సెల్డను కెప్టెన్ కార్డినల్ మిండ్సజంటీకు యీ సందర్భంలో అవసరమైన సలహాలన్నింటినీ యిచ్చి, ఆర్థికసహాయం చేసి, యితణ్ణి రహస్యంగా కుట్రలు చేయడానికి వినియోగించాడు. కాథలిక్ చర్చి మతాధిపతి అయిన మిండ్సజంటీ హంగరీలోని సోవియట్ సైన్యాన్ని

గురించీ, కమ్యూనిస్టుల కార్యకలాపాలను గురించీ, యింకా దేశంలో ఆర్థిక రాజకీయ పరిస్థితులను గురించిన భోగట్టాను- అంతా అమెరికా రాయబారి చాపిన్‌కూ, రాయబార కార్యాలయ కార్యదర్శి కోయెస్ట్లకు అందజేశాడు. కార్డినల్ మిండ్స్‌జెంటీ యీ సమాచారాన్నంతటినీ మతాచార్యులద్వారా సేకరించాడు. ఈ విధంగా మిండ్స్‌జెంటీ అమెరికా రాయబార ప్రతినిధులతో కలసి ప్రభుత్వ విధానం యెడల ప్రజలలో అసంతృప్తిని రెచ్చగొట్టి వారిని ప్రభుత్వ కార్యక్రమాలను విధ్వంసం చేయడానికి పురికొల్ప ప్రయత్నించాడు. ఆ విధంగా దేశంలో ప్రవేశపెట్టబడుతున్న ప్రజాతంత్ర సంస్క-రణలను అమలు జరగకుండా చేయడానికి ప్రయత్నించారు. ఈ సందర్భంలో మిండ్స్‌జెంటీ నాయకత్వానవున్న హంగరీ అభివృద్ధినిరోధకముఠా ఆశయమూ, అమెరికా సామ్రాజ్యవాదుల ఆశయమూ సంపూర్తిగా కలిసిపోయాయి.

విచారణసమయంలో మిండ్స్‌జెంటీ స్వయంగా చెప్పిన సాక్ష్యంలోని భాగాన్ని కొంత ఉదహరిస్తా.

"పశ్చిమరాజ్యాల సహాయంతో ముఖ్యంగా అమెరికా సహాయంతో హంగరీలోవున్న సోవియట్ సైన్యాలు వెళ్ళిపోయేటట్లు చేసి, ఆతరువాత అమెరికా వారి సాయంతో ప్రభుత్వాన్ని మార్చాలని ప్రయత్నించాను. ఈ ఉద్దేశ్యంతోనే నేను పశ్చిమ రాజ్యాలతో యిక్కడున్న వారి ప్రతినిధులతో సంబంధాలను పెట్టుకొన్నాను. ఈ ప్రయత్నసాఫల్యం కోసమే నేను బుడాపెస్ట్‌లోవున్న పశ్చిమరాజ్యాల రాయబార కార్యాలయాలతోనూ, ముఖ్యంగా అమెరికా రాయబారవర్గంతోనూ సన్నిహిత సంబంధాలను ఏర్పాటు చేసుకొన్నాను."

ఇంతకంటే మరేమి సాక్ష్యం కావాలి అమెరికా రాయబారుల కుటిల రాజనీతిని రుజువుచేసేందుకు? దీనినిబట్టి హంగరీ దేశంలోని ఆంతరంగిక పరిపాలనా వ్యవస్థ అమెరికా సామ్రాజ్యవాదులు ఆమోదించిన రీతిగా లేదుగాబట్టి, దానిని దౌర్జన్యంగా మార్చడానికి అమెరికా రాయబార ప్రతిధులు ప్రయత్నించారని స్పష్టమవుతున్నది.

## రుమేనియాలో

రుమేనియాలోని ఆంగ్లో - అమెరికన్ ప్రభుత్వాల ప్రతినిధుల కార్యకలాపాలు కూడా దాదాపు ఇదే స్వభావాన్ని కలిగి వున్నాయి. కొన్నిమాసాలక్రితం - 1948 అక్టోబరు నవంబరు మాసాలలో ఆంగ్లో అమెరికన్ రహస్య డిపార్టుమెంటు చెప్పుచేతలలోపనిచేస్తున్న కొంతమంది కుట్రదారుల ముఠాపై బుఖారెస్టులో ఒక విచారణ జరిగింది. ఈ ముఠాకు పెద్ద పెట్టుబడిదారుడూ, రిసిటా మిల్లులకు యిదివరకు డైరెక్టర్ జనరల్‌గా వున్నవాడు అయిన అలెగ్జాండ్రూ పాప్, ఐరాన్ గార్డుకూ, మరికొన్ని ఫాసిస్టు సైన్యాలకూ

సంబంధించిన నికోలీ పాత్ర సూ్కు, జీవోర్గ్గామాను లు నాయకులు. బ్రిటిషు అమెరికన్ రహస్య సంఘాల ఆధ్వర్యాన యీ ముఠా ప్రస్తుత ప్రభుత్వాన్ని దౌర్జ న్యంగా కూలద్రోసి ప్రజాస్వామిక ప్రజా తంత్ర వ్యవస్థను తుదముట్టించి దాని స్థానే తిరిగి భూస్వామిక, బూర్జువావర్గాల అధి కారాన్ని నెలకొల్పేందుకు కుట్రపన్నింది.

ఈముఠాకు ఆర్థిక సహాయం చేసింది. మాక్స్ అచునిట్ అనే పారిపోయిన రుమేనియా పెట్టుబడిదారుడు. ఇతగాడు వికార్సు లిమిటెడ్ అనే బ్రిటిషు గుత్త పెట్టుబడిగల ఆయుధాల కర్మాగారానికి భాగస్తుడు. బ్రిటన్‌లో పెద్ద బ్యాంక్‌లలో ఒకటైన వెస్టుమినిస్టర్ బ్యాంకులో వాటాదారు. ఈ విధంగానే అచునిట్‌కు అనేక అమెరికన్ కార్పరేషన్లలో వాటా లున్నాయి.

రుమేనియా ప్రజారిపబ్లిక్ స్వేచ్ఛా సర్వస్వాతంత్ర్యాలకు వ్యతిరేకంగా పన్న బడిన యీ కుట్ర బ్రిటిష్, అమెరికన్ రాయబార ప్రతినిధుల సలహా సంప్రతింపు లపై జరిగింది. ఈ కుట్రదారులకు ఆంగ్లో–అమెరికన్ రాయబారులు డబ్బుతోనూ ఆయుధాలతోనూ సహాయపడతామని వాగ్దానం చేశారు. ఈ ఫాసిస్టు కుట్ర దారులు విదేశప్రభుత్వాలకు గూఢచారు లుగా పనిచేయడంలోనూ, విధ్వంసక కార్యాలలోనూ, ప్రభుత్వ సభ్యులనూ, యితర ప్రముఖ రుమేనియా రాజకీయ వేత్తలనూ హత్యచేయడానికి కుట్రలు సాగించడంలోనూ పాల్గొన్నారు. వీరు రుమేనియా భారీపరిశ్రమలలో విధ్వంసక కార్యక్రమాలను పురికొల్పి ఉక్కుఉత్ప త్తిని రైల్వేలోకోమొటీవ్‌లూ, మోటార్ కార్ల ఉత్పత్తిని కొంతవరకు కుంటుపరచి దేశఆర్థికవిధానాన్ని దెబ్బతీయ గలిగారు. ఈ కుట్రలోని ముద్దాయిలంతా రేసిటా మిల్లులను విచ్ఛిన్నం చేయడానికి, యితర పరిశ్రమలకూ, రవాణాసౌకర్యాలకూ హాని కలుకజేయడానికి తాము ఏవిధంగా ప్రయత్నించారో వివరంగా తెలిపారు. ఈ నేరస్థులు తమ కుట్రల కార్యకలా పాలను గురించి ఎప్పటికప్పుడు ఆంగ్లో–అమెరికన్ రాయబార కార్యాలయాలకు తెలుపుతూ వారి సలహా సంప్రతింపుల తోనే కొనసాగించారు.

అంతేకాదు; రుమేనియా ప్రభుత్వం యెడల ప్రజలలో పూర్తిగా అసంతృప్తిని రెచ్చగొట్టేందుకు తమ యావత్ శక్తినీ వినియోగించారు. ఇందుకోసం వారు కార్మికులకు వెళ్ళేసరఫరాలను విచ్ఛిన్నం చేశారు. కార్మికుల వేతనాలను పనిపెట్టు కొని మరీ ఆలస్యంగా చెల్లించేవారు. అదే సమయంలో ప్రభుత్వానికి సంబంధిం చిన అన్ని వ్యవహారాలను సేకరించి ఆంగ్లో-అమెరికన్ రాయబారవర్గ ప్రతినిధులకు అందజేసేవారు.

రుమేనియన్ టెర్రరిస్టుల, గూఢచా రుల, కుట్రదారుల చేస్తున్న అనేక రకా లైన వ్యవహారాలన్నింటినీ అమెరికా, బ్రిటన్ రాయబార కార్యాలయాలకు సంబంధించిన ఒకముఠా నడుపుతూ వుండేది. బుఖారెస్టులో జరిగిన విచారణ సందర్భంలో యీ క్రింది పేర్లు బయట పడ్డాయి: హెన్రీ పి. లివరిచ్, బుఖా రెస్టులోని అమెరికా రాయబార కార్యా లయంలో సలహాదారుడు; జాన్‌లోవెల్, అమెరికా మిలిటరీ కార్యాలయా నికి సంబంధించిన వ్యక్తి; అమెరికా రాయబార కార్యాలయ కార్యదర్శులు; డోన్సాల్లు టి. డన్‌హామ్ గాబస్ట

షి యి, జి. వాఘ్‌హాం, ఫర్గూసన్; బ్రిటిష్ రాయబార కార్యాలయ సలహాదారుడు చార్లెస్ డబ్ల్యూ. రాబిన్‌సన్; వ్యాపార శాఖకు సంబంధించిన విలియమ్ వాట్సన్; బ్రిటిష్‌జనరల్ గ్రీర్, కలనల్ ఖిల్ యంగ్. మనియూ, బ్రాటియానుల నాయకత్వాన రాజకీయంగా దివాళా తీసిన రుమేనియాలోని పాతరాజకీయపార్టీలపని నేపాప్ ముఠా కొనసాగించడం ప్రారంభించింది. ఒక సంవత్సరం క్రిందట వీరి వ్యవహారమంతా బట్టబయలు చేయడమైనది. మనియూకుట్రలో రుమేనియాలోని అమెరికా రాజకీయ ప్రతినిధి బర్టన్. వై. బెర్రీ సలహాదారుడైన రాయి, యమ్. మెల్బెరిన్‌లు ప్రధాన పాత్రను నిర్వహించినట్లు తేటతెల్లమైంది. నేషనల్ జారినిస్టుపార్టీ నాయకులంతా అరెస్టుకాబడి, మనియూ కుట్రంతా పూర్తిగా విఫలమైన తరువాత తాను రుమేనియాను విడిచిపెట్టి వెడుతూ మెల్బోరిన్ తాను వెళ్ళిపోయిన తరువాత అమెరికా ప్రభుత్వంతో సంబంధాలను వెరిచ్ ద్వారా పెట్టుకోవలసిందని పాప్‌తో చెప్పాడు. అతని సలహాప్రకారము కుట్రదారులు అమెరికా మిలిటరీ శాఖకు సంబంధించిన కలనల్ లోవెల్‌తోనూ అమెరికా రహస్య ఆఫీసర్లుగా వున్న హాల్, హామిల్టనులతో సంబంధాలను ఏర్పరచుకొన్నారు,

కోర్టులో పాప్ ఒప్పుకొన్న విషయాన్నే యిక్కడ కొంతభాగాన్ని ఉదాహరించుతా:—

"బ్రిటిష్, అమెరికన్‌ల కోరికపై దేశంలో అనుసరించబడుతున్న రాజకీయ, ఆర్థిక జీవిత వ్యవహారాల భోగట్టా అంతా వారికి ఖచ్చితంగా ఎప్పటికప్పుడు తెలియజేయబడింది ......ఒక విందులో మా కార్యాకలాపాలలో మేము అనుసరించ దగు కార్యక్రమవిధానాన్నంతటినీ మెల్బోరిన్ సూచించాడు".

ఏమిటా కార్యక్రమం? ఎప్పటి పాత కథే. రుమేనియాలోని అభివృద్ధి నిరోధక ముఠాలకు రాజకీయంగానూ, ఆర్థికంగానూ వాషింగ్‌టన్ లండన్ వర్గాలు సహాయపడటం: టెర్రరిస్టు ముఠాలను నిర్మించడం; ఆర్థికవిధానాన్ని విధ్వంసం చేయడం; ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వానికి-అంటే ప్రజలచే న్యాయంగా ఎన్నుకోబడిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా గూఢచారి పనిచేయడం, కుట్రలు పన్నడం.

సాయుధ తిరుగుబాటుకు జరిగిన ప్రయత్నాలలో బ్రిటిషు, అమెరికన్ రాయబారులు స్వయంగా నిర్వహించిన పాత్రను పాప్ కోర్టులో వివరంగా తెలియజేశాడు.

"వారు (ఆంగ్లో-అమెరికన్ రాయబారులు) మెల్బోరిన్, వెవెరిచ్‌ల ద్వారా ఆయుధాలనూ, యితర సామాగ్రినీ, ఆహారాన్ని రవాణాసౌకర్యాలను సరఫరా చేయడానికి మాట యిచ్చారు. అనుకున్న సమయానికి యివన్నీ పారాచూట్‌లుద్వారా నియమిత స్థలాలో దింపేటట్లు ఏర్పాట్లు జరిగాయి. విధ్వంసకముఠాలు తమ కార్యక్రమాన్ని నెరవేర్చేందుకు తగిన సలహాలనిచ్చి పనిచేయించడానికి కొంతమంది బ్రిటిష్ అమెరికన్‌లు పారచూట్లుద్వారా దిగే ఏర్పాటు జరిగింది. అమెరికన్‌లు కనుసన్న చేసిన వెనువెంటనే యీ కుట్రచేసే ముఠాలు కార్యరంగంలో ప్రవేశించే ఏర్పాట్లు జరిగాయి.

అమెరికా సామ్రాజ్యవాదుల చెప్పు చేతులలో వుండే అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని దౌర్జన్యంగా నెలకొల్పడానికి ప్లానుగాక యిది మరేమిటి? ఆవిధంగా రుమేనియాలో సామ్రాజ్యవాదులకు స్థానాలను లభింప జేయడానికి పన్నాగాన్ని పన్నారు.

## బల్గేరియాలో

మరొక విచారణను- యీ సంవత్సరం మార్చి ప్రారంభంలో సోఫియాలో జరిగిన విచారణను తీసుకొందాం. ఈ కుట్రలో క్రైస్తవ చర్చికి చెందిన కొంతమంది నాయకులు పాల్గొన్నారు. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో ఆంగ్లో-అమెరికన్ల యాజమాన్యాన జరిగే గూఢచారి అక్రమ కార్య కలాపాలలో అభివృద్ధి నిరోధక మతగురువులకు ప్రత్యేక స్థానం ఉంది. హంగరీ పోలండ్‌లలో కేథలిక్ మత గురువులనూ కార్డినల్సునూ వినియోగించారు. బల్గేరియాలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు తమ తప్పుడు కార్యక్రమాలలో వినియోగ పడటానికి క్రైస్తవ మతాధిపతులు దొరికారు. ఆంగ్లో-అమెరికన్ రాయబారులూ యీ మతాధిపతులూ కలసి "పితృభూమి సంఘటన" పరిపాలనను తుదముట్టించి బల్గేరియాలో ఫాసిస్టు ప్రభుత్వాని నెలకొల్పడానికి కుట్రలు పన్నారు.

ముద్దాయీలలో ఒకడైన వాసిలీ జయుప్కాఫ్ అనే అతడు బ్రిటిష్ అమెరికన్ రహస్య డిపార్టుమెంటుకు సంబంధించిన యస్. జి. బర్ట్ ఆండ్రూస్, సిరిల్ బ్లాక్‌లతో సంబంధం పెట్టుకొన్నాడు. జయుప్కాఫ్ ఆంగ్లో - అమెరికన్ రహస్య సర్వీసులోని వివిధ కార్యక్రమాలను నెరవేర్చడానికి నియమింపబడ్డాడు. ఉదాహరణకు 1946 లో బర్ట్ - ఆండ్రూస్ ఆజ్ఞపై అతడు పారిస్‌లో జరిగే శాంతి మహాసభకువెళ్ళే స్లావ్ దేశాల ప్రతినిధుల వెంటవుండి, వారి కార్యకలాపాలనన్నింటినీ బ్రిటిషు ప్రతినిధివర్గ ప్రధాన కార్యదర్శికి వివరంగా రిపోర్టు నిచ్చాడు. 1947 మార్చిలో బల్గేరియాలోని అమెరికా రాయబార కార్యాలయం బెక్ ద్వారా జయుప్కాఫ్‌కు యీ క్రింది సలహాలనిచ్చింది.

"దేశంలో ప్రభుత్వానికి ప్రతికూలురుగావుండే అసంతృప్తిజీవులున్నారు. అందులో చాలమంది మీచర్చికి సంబంధించినవారున్నారు. అసంతృప్తితోవున్న యీ ముఠాలు మా పనికీ, మీ పనికీ చక్కని సాధనంగా వినియోగ పడతారు. బల్గేరియాలో అసంతృప్తిజీవులు ఎంతమంది ఎక్కువగా వుంటే కమ్యూనిస్టులు తమ 'పితృభూమి సంఘటనా' ('ఫాధర్‌లాండ్ ఫ్రంట్') పరిపాలనను కొనసాగించడం అంతకష్టం. అందువలన యీ అసంతృప్తిగల యీ ముఠాలమధ్య మీ పని చేసి వాటినన్నింటినీ ఒక పెద్ద ముఠాలోకి ఐక్యపరచాలి. ఈ అసంతృప్తిజీవులతో స్నేహపూరిత సంబంధాలను ఏర్ప

రచుకోని వారిలో మీరు పని చేయాలని కోరుతున్నాను.''

## కుట్రదారులకు అమెరికా డబ్బు

ఇతర కుట్రలను విచారించినప్పుడు జరిగినట్లే సోఫియాలో జరిగిన విచారణలో కూడా బల్గేరియాలో సామ్రాజ్యవాదుల రహస్య అక్రమ కార్యకలాపాల పూర్తి వివరాలన్నీ స్పష్టంగా బయటపడ్డాయి. అన్నింటిలోకి బయటపడిన ముఖ్యమైన యీ క్రింది విషయాన్ని ఉదహరిస్తా:

**రెండో ప్రపంచ యుద్ధానికి ముందు ఐక్య క్రైస్తవచర్చి నాయకులకు అమెరికానుండి మస్తుగా డబ్బు వస్తూఉండేది. యుద్ధం జరుగుతూ వుండగా వీరిని జర్మన్ ఫాసిస్టులు బాగా మేపారు. యుద్ధం అయిపోయిన తరువాత తిరిగి అమెరికా డబ్బు యీ నాయకులకు కొల్లలుగా వచ్చి పడుతున్నది.**

మరొక ఉదాహరణ - ఆఖరిది - తెలియజేస్తా. గత సంవత్సరం సెప్టెంబరు, డిసెంబరులలోనూ యీ సంవత్సరం జనవరి మాసంలోనూ జరిగిన విచారణల, సందర్భంలో అమెరికా, బ్రిటన్‌ల యాజమాన్యాన దేశద్రోహానికి పూనుకున్న గూఢచారులనూ, విధ్వంసకారులనూ జెకోస్లోవేకియాలో పట్టుకోవడం జరిగింది. పట్టుబడిన ప్రతిసందర్భంలోనూ యీగూఢచారులకూకుట్రదారులకూరహస్యఅభివృద్ధి నిరోధక టెర్రరిస్టు విధ్వంసక ముఠాలతో పూర్తి సంబంధమున్నట్లు బయటపడింది. ఈ ముఠాలకు లండన్, వాషింగ్టన్ పాలకవర్గాల సహాయం, మద్దతున్నట్టు రుజువయ్యాయి.

పోలెండులోకూడా అమెరికా, బ్రిటన్ రాయబారులు కుట్రలలో పాల్గొన్న ఉదాహరణలు చాల వున్నాయి. బ్రిటిష్ రాయబారి కేవండిష్ - బెంటిక్, అమెరికా రాయబారి ఆర్థర్ బ్లిస్‌లేన్ తమ మిలిటరీ ఉద్యోగులతో కలిసి పోలండ్‌లోని రహస్య టెర్రరిస్టు, అక్రమ సంఘ కార్యక్రమాలకు సారథ్యం వహించారు.

ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాల్లో వున్న ప్రతి టెర్రరిస్టు కేంద్రానికీ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన ప్రతి కుట్రకూ తప్పనిసరిగా బ్రిటన్ అమెరికా రాయబారవర్గాలతో సంబంధం వుండి తీరుతుందనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు.

విచారణలలో బయటపడిన హంశాలు ఆంగ్లో-అమెరికన్ పాలకవర్గాలు ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాల ప్రభుత్వాలను పడగొట్టడానికి కుట్రలను కొనసాగించుతున్నారనే యదార్థాన్ని ధృవపరుస్తున్నాయి. ఈ కుట్రలన్నీ పశ్చిమ యూనియను, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికల కార్యక్రమాలకు అనుగుణ్యాంగానే పన్నబడ్డాయి. ఇవన్నీ సామ్రాజ్యవాదుల దురాక్రమణ ప్లానులలో ఒకభాగము మాత్రమే. మొట్టమొదటినుండీ కూడా ఆంగ్లో - అమెరికను సామ్రాజ్యవాదులు యీ దేశాలతో స్నేహపూరిత సంబంధాలను నెలకొల్పుకోడానికిగాక దురుద్దేశ్యముతో వాటి అంతరంగిక విషయాలలో జోక్యాన్ని కలిగించుకోనేందుకే ప్రయత్నించుతున్నారు. ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాద రాజకీయవేత్తలకు చిన్న

రాజ్యాలన్నా, వాటి జాతీయ సర్వ స్వాతంత్ర్యమన్నా, ఆ జాతులు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొనే హక్కన్నా వున్న ద్వేషమూ, అసహ్యతా ప్రతి సందర్భంలోనూ, స్పష్టపడుతూనే ఉన్నాయి.

1948 మార్చిలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో విధ్వంసక టెర్రరిస్టు కార్యక్రమాలను జరపడానికి "అపరేషన్ యక్సు" అనే ఒకప్లానును సెనేటర్ బ్రిడ్జ్యేసే అనే అతను ప్రతిపాదించాడు. ఆ తరువాత కొద్దికాలానికి "యు. యస్ న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్టు" అనే పత్రిక 'కోల్డువార్ రహస్య ఎత్తుగడలు' అనే శీర్షికక్రింద యీ ఎత్తుగడలనే విపులంగా వివరించింది. అందులో యీ విధంగా ఉన్నాయి.

"అవసరమైతే హత్యలతో సహా గట్టి సాయుధ చర్యలు", రష్యాకు స్నేహంగా వుండే రాజ్యాలలోని "రహస్య ఉద్యమాలకు ఆర్థిక సహాయం చేయడం", "అమెరికావారి సలహాతో" బలమైన సాయుధ దళాలను ఏర్పరచడం, "ప్రముఖ కమ్యూనిస్టులను హత్య చేయడానికి ప్రోత్సహించడం", "కమ్యూనిస్టువ్యతిరేక చర్యలను నడిపించడానికి అమెరికా ఏజంట్లను పారషూట్ల ద్వారా తూర్పుయూరప్‌లోకి దింపడం."

అమెరికా కాంగ్రెసు వర్గాలలోనూ ప్రభుత్వ వర్గాలలోనూ "తూర్పు యూరప్‌లోని కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమాలకు ఆర్థిక సహాయం చేసే విషయమై" ఒక ప్లానును గురించి ఆలోచించబడుతున్నట్లు దాదాపు అదే సమయంలో యునైటెడ్ ప్రెస్ ఏజన్సీ వాషింగ్టన్ విలేఖరి తెలియజేశాడు. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో కుట్రలు చేసే అభివృద్ధి నిరోధక రహస్య ముఠాలకు కాగితాన్నీ, ఆయుధాలనూ, మందుగుండు సామాగ్రినీ 'సబ్సిడీగా' సరఫరా చేయాలని వారి అభిప్రాయం. అయితే తూర్పు యూరప్‌లోని అక్రమ కార్యకలాపాలకు సహాయపడేందుకు యీ డబ్బును వినియోగించుతామని బిల్లులో తెలియజేయడం అవమానకరం. కాబట్టి ఆ విధంగా పైకి ఉదహరించలేదు. కాని అంతటి పెద్ద మొత్తాలను అమెరికా శాసనసభ శాంక్షన్ చేసేటప్పుడు దీని ఆశయాన్ని వివరించడం మామూలుగా జరిగే విషయం. కాని యీసారి ఆ సాంప్రదాయాన్ని సహితం అమెరికా ప్రభుత్వం అతిక్రమించింది. "ఇలాంటి దొకటి యిదివరకు జరిగింది కాబట్టి" మామూలుగా వున్న రూలును అతిక్రమించడం సాధ్యమైనదని యు. పి. విలేఖరి సమర్థించారు.

యుద్ధకాలంలో ఆటంబాంబులను రహస్యంగా తయారుచేసే కార్యక్రమానికి డబ్బును యీ విధంగా కారణం తెలుపకుండా శాంక్షనుచేయడంజరిగిందని ఉదహరించాడు. ఆహా! దానికీ దీనికీ ఎలాంటి సాపత్యం!

గత వేసవిలో - ఆనాడు బ్రిటిషు సివిల్ సర్వీసునుండి కమ్యూనిస్టులను బయటకు వెళ్ళగొట్టుతున్న బ్రిటిషు మిలిటరీ

రహస్య డిపార్టుమెంటు ప్రధాని పెర్సీ సిల్లోటోవ్ మధ్య, ఆగ్నేయ యూరప్ దేశాలలో ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలను సమిష్టిగా జరిపే విషయమై సంయుక్తంగా ఆలోచించేందుకు బ్రిటిషు మంత్రి వర్గాన్నుండి తగిన సలహాలతో అమెరికా వెళ్ళాడు. అక్కడ సంప్రతింపుల ఫలితంగా వారు సూచించిన కార్యక్రమం గమనింపతగ్గది: సోవియట్ యూనియనుకూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలమధ్య స్నేహపూర్వకమైన సహకారం జరుగకుండా అడ్డుతగలడం; ఆ దేశాల ప్రజలలో కుట్రలద్వారా సోవియట్ యెడల అన్నివిధాలా అసంతృప్తిని రెచ్చగొట్టడం; ప్రభుత్వంలోనూ, పరిశ్రమలలోనూ విధ్వంసక కార్యక్రమాన్ని కొనసాగించేందుకు ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలలోని వ్యతిరేక గ్రూపులను పూర్తిగా వినియోగించుకోవడం; తూర్పు యూరప్ దేశాలలోకి సోవియట్ వ్యతిరేక ప్రచారంచేసే పత్రికలను విరివిగా పంపించడం, ఆదేశాల రక్షణశక్తిని కొంచెపరచేందుకు ప్రయత్నించడం.

ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాల్లో ఆంగ్లో-అమెరికను కూటమి ప్లానులనూ, ప్రభుత్వ వ్యతిరేకచర్యలను మనం తెలుసుకొన్న తరువాత ఆ దేశాలలోని ప్రజాకోర్టుల శిక్షలనుండి తప్పించుకోడానికి పారిపోయి లండను, వాషింగ్టనులలో తలదాచుకొంటున్న దేశద్రోహులకూ, దివాళాతీసిన రాజకీయపార్టీ నాయకులకూ అమెరికా స్టేట్ డిపార్టుమెంటు ప్రత్యేకించిన పాత్రను అర్థం చేసుకోవడం సులభమే. ఈ ద్రోహులపైననే ఆధారపడి సామ్రాజ్యవాదులు ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వాలను పడగొట్టడానికి అమెరికాలోని స్టేట్ డిపార్టుమెంటూ' లండనులోని లేబర్ ఫారిన్ ఆఫీసూ ప్రయత్నించుచున్నాయి. అమెరికాలోనూ బ్రిటన్‌లోనూ రెండు ప్రభుత్వాల రహస్య డిపార్టుమెంటుల సంయుక్త ఆధ్వర్యాన ఎలాంటితప్పుడుపని చేయడానికైనా సిద్ధపడిన నీచులకు తర్ఫీదునిస్తున్నారు. పత్రికలలో ప్రచురించబడే వార్తలనుబట్టి చూస్తేప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలనుండి పారిపోయిన ద్రోహులందరినీ, యుద్ధసమయంలో ఆదేశాల్లో పనిచేసిన మాజీ జర్మన్ ఆఫీసర్లనూ విధ్వంసక కార్యక్రమాలలో వినియోగించడానికి యింకా ఎక్కువగా లండన్ వాషింగ్టన్‌లలో విపులమైన ప్లానులనుపన్నుతున్నట్లు స్పష్టమవుతున్నది. అమెరికా రహస్య సర్వీసులో పనిచేయడానికి సిద్ధపడే దేశస్థులను, ముఖ్యంగా తూర్పుయూరప్‌నుండి అమెరికా ప్రవేశించకోరేవారికి అనుమతినిచ్చే ఒక ప్రత్యేక చట్టాన్నికూడా అమెరికా ప్రభుత్వం గత మార్చిలో ప్యాస్ చేసింది.

అయితే అమెరికాతోసహా సామ్రాజ్యవాద రాజ్యాల విదేశాంగ విధానాలలో నమ్మకంగా బొడ్డులో కత్తిపెట్టుకొని ద్రోహంచేసే పద్ధతులు మరేమి కొత్తవి కాదు. ఈ సందర్భంలో లాటిన్ అమెరికన్ దేశాలలో అమెరికా రాయబారులు అనుసరించే పద్ధతులను చక్కటి ఉదాహరణలుగా చూపెట్టవచ్చు. అక్కడ అమెరికా సామ్రాజ్యవాదం యొక్క ఆధిపత్యాన్ని ఆ విధంగానే రుద్దడం జరిగింది. కాని యీనాడు జరిగేదేమంటే ఆ విద్రోహ పద్ధతులన్నీ ఎలాంటి చాటుమాటులేకుండా బహిరంగంగానే అమలు జరుపబడుతున్నాయి. ప్రస్తుతం జరుగుతున్న దల్లా విదేశాంగ రాజనీతిలోని అసలు

ప్రాముఖ్య విషయాల నన్నింటినీ వెనక్కి నెట్టి, అక్రమ విధ్వంసక కుట్రలను సాగించడమే ప్రధాన ఆశయంగానూ, ప్రధాన భాగంగానూ ఆంగ్లో - అమెరికన్ రాయబారులు పెట్టుకొన్నారు. ఇదే మనకీనాడు కంటికగుపడే దృశ్యం. వారి పద్ధతులు రోజురోజుకు బందిపోటు పద్ధతులవలె మోటుగా తయారవుతున్నాయి. వీటిని వారు ముఖ్యంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో అనుసరిస్తున్నారు. రాయబారులు మరొక దేశం యొక్క ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యాన్ని కలిగించుకోరాదనే న్యాయ సూత్రం అందరికీ తెలిసిన విషయమే. పైగా ఆ విధంగా జోక్యం కలిగించుకోవడం అందరూ అంగీకరించిన అంతర్జాతీయ సూత్రాలకు పూర్తిగా విరుద్ధం.

ఈ సూత్రాన్ని అతిక్రమించిన రాయబారి వెంటనే పక్షపాతిగా పరిగణించబడి తొలగించబడతాడు. కాని మన కండ్లముందే కాలం మారిపోతున్నది. సామ్రాజ్యవాద రాజ్యాల పాలక వర్గాలు యీ గౌరవ ప్రదమైన అంతర్జాతీయ సహకారాన్ని తిరస్కరించాయి. ఈనాడు వారి రాజనీతి బొడ్డులో కత్తిపెట్టుకొని దొంగచాటుగా దెబ్బతీసే రాజనీతిగా తయారైంది. ఈనాడు వారు అతినీచమైన పద్ధతులను సహితం ఎలాంటి సంకోచం లేకుండా అనుసరిస్తున్నారు. ఎందువల్లనంటే వారు మూడో ప్రపంచ యుద్ధం కోసం బహిరంగంగానే అన్నినీతులకూ తిలోదకాలు వదలి ఎడతెగని ప్రయత్నాలు చేస్తున్నారు.

ఆంగ్లో-శాక్షన్ రాయబారులు ఆచరణలో యీ విధంగా నైతిక పతనంచెందడం బూర్జువా ప్రజాతంత్రంలో వచ్చిన సంక్షోభంయొక్క ప్రతిబింబం మాత్రమే. అన్నా బెల్లీ బకర్ అనే ఆమె వ్రాసిన (ఈమె యీ మధ్యవరకూ సోవియట్‌లోని అమెరికా రాయబారవర్గ కార్యాలయంలో ఉద్యోగి) * "అమెరికా రాయబారుల నిజస్వరూపం" అనే గ్రంథం అమెరికాస్టేట్ డిపార్టుమెంటులో వుండి అమెరికా-సోవియట్ వ్యవహారాల నన్నింటినీ యీనాడు నడుపుతున్న సోవియట్‌కు పచ్చివ్యతిరేకుల ముఠాపై చక్కని సమాచారం యిచ్చింది.

ఈ గ్రంథం శాంతికాముకులందరికీ కనువిప్పుగా ఉంటుంది. అమెరికా సోవియట్ యూనియన్‌ల మధ్యయుద్ధాన్ని రెచ్చగొట్టడానికి తన యావత్ శక్తినీ వినియోగించుతున్న జార్జికెన్నన్ యీ నాడు వాషింగ్‌టన్ పాలకవర్గాల పాలసీ ప్లానింగ్ బోర్డుకు అధిపతి. ఇతడు బెర్లిన్ స్కూలులో తర్ఫీదుపొందిన అమెరికా రాజ్యాంగవేత్త. ఈపదవిలోవుండి యితడు ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల యెడల అమెరికా అవలంబించే మూల సూత్రాలనుకూడా నిర్ణయిస్తాడు. ఇతణ్ణి గురించి అన్నా బెల్లీ బకర్ యిలాచెప్పింది. "ఆధునిక అమెరికా ప్రధాన రాజ్యాంగవేత్త జార్జికెన్నన్‌కు ఆటంబాంబులో చాల విశ్వాసముంది. కమ్యూనిజానికి అదొక్కటే ఆఖరిజవాబుగా అతడు భావిస్తున్నాడు."

---

* ఈ పుస్తకాన్ని ఇండియాలో టాస్ వార్తా సంస్థ ఇంగ్లీషులో ప్రకటించింది.

వెల అర్థరూపాయి — సంపాదకుడు.

ఇలాంటి రాజ్యాంగవేత్తల చేతుల లోనే అమెరికన్ ప్రజలకూ యూరప్ ప్రజలకూ మధ్యనుండే సంబంధ బాంధ వ్యాల భవిష్యత్తు ఆధారపడిఉంది!

కాని మామూలుగా జరిగేదేమంటే పొగరుబోతు సామ్రాజ్యవాదులు తమ బలాన్ని ఎక్కువగా అంచనా వేసుకొని ప్రజల బలాన్ని తక్కువగా అంచనా వేస్తారు. ఈ ఊహ ప్రకారమే ఆంగ్లో-అమెరికన్ రాజకీయవేత్తలు తమ విధ్వంసక కుట్రలద్వారా చరిత్రగతినే మార్చి వేయగలమని భావించుతున్నారు. ప్రజా స్వామిక ప్రజాతంత్ర రిపబ్లిక్‌లను నాశనం చేయగలమనీ, సోషలిస్టుబాటను స్వీకరించిన రాజ్యాల ఆర్థిక అభివృద్ధిని ఆటంక పరచగలమనీ, రాజకీయ ఐక్యతను విచ్ఛిన్నం చేయగలమని వూహించుతున్నారు. ఆత్మసంతృప్తితోవున్న యీ రాజకీయ వేత్తల దూరదృష్టిలేని అంచనాలన్నీ తారుమవుతున్నాయి. లాటిన్ అమెరికా దేశాలలో తాము అనుసరించిన పద్ధతులు ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో ఎదురుతిరిగాయి. తామనుసరిస్తున్న యీ తప్పుడు విధానాలవల్ల తమ రాజకీయ ఏజెంట్లతోసహా అమెరికా, బ్రిటన్ రాయబారులు - దానితోపాటు ఆంగ్లో-అమెరికా కూటమి అనుసరించే పాలసీయే అసహ్యతపాలయింది.

రుమేనియా వార్తా పత్రిక 'స్కాంటియా' ఇలా వ్రాసింది.

**"అమెరికా గూఢచారుల కుట్రలకు ఆలవాలమైన ప్రజా స్వామిక ప్రజాతంత్రరాజ్యాలు యిటీవలి సంవత్సరాలలో సామ్రాజ్యవాదుల గూఢ చారుల కేంద్రాలను బట్ట బయలు చేయడంలోనూ, శత్రువు అనుసరించే విచిత్ర పద్ధతులను తెలుసుకోవడం లోనూ చక్కటి అనుభవాన్ని సంపాదించ గలిగాయి."**

**ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో ఆంగ్లో - అమెరికన్‌ల కుట్ర కార్యకలాపాలు ఎప్పటి కప్పుడు విఫలతచెందడం ఒకపరమ సత్యాన్ని రుజువు చేస్తున్నాయి. అదేమంటే సామాన్య ప్రజలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను మెలకువతో కాపాడుకొనే పక్షంలో సామ్రాజ్యవాద దురాక్రమణదారులు ఎలాశక్తి విహీను లవుతారో తేట తెల్లమైంది.**

—న్యూ టైమ్స్

**6—4—49**



## ముఖచిత్రం



చైనా ప్రజల చరిత్రలో 1949 మార్చి 25 మరవురాని తేదీగా వుండిపోతుంది. ఆనాడు చైనా కమ్యూనిస్టునేత ప్రాచ్యదేశాల విప్లవజ్యోతి కామ్రేడ్ మా-సి-యాంగ్, బ్రహ్మాండమైన విజయ పరంపరలు పొందుతున్న చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యులూ చైనా ప్రఖ్యాత ప్రాచీన రాజధానినగరం — పీపింగ్ ప్రవేశించారు.

చైనా ప్రజల విజయ ఆనందానికి మేర లేదు.

కమ్యూనిస్టునాయకుల ఆగమనానికి ఎదురుచూస్తూ నిర్ణీత సమయానికి చాల గంటలముందునుండే వెస్ట్ ఎయిర్‌ఫీల్డు (విమానాశ్రయం) వద్ద ప్రజలు తండోపతండాలుగా గుమిగూడారు. ఏండ్ల తరబడిగా బానిసత్వంలో క్రుగ్గుతున్న తమ ప్రియమాతృభూమి చైనాను దాదాపు విముక్తిచేయడానికి కారణభూతులైన మహానాయకులకు తమ సుస్వాగతము చెప్పడానికి కార్మిక, కర్షక, మహిళా, విద్యార్థి మొదలుగాగల ప్రజాతంత్ర సంస్థల ప్రతినిధులూ, ప్రొఫెసర్లూ, ప్రజాముక్త సైన్యాధిపతులూ విచ్చేశారు.

సాయంకాలం 5 గంటలకు విమానంలోనుండి అధ్యక్షుడు కామ్రేడ్ మావ్, జనరల్ చూ-టేలు దిగి ప్రజలకు కనపడగానే జయజయ ధ్వానాలు మిన్నుముట్టాయి.

కేంద్ర కమిటీ సభ్యులూ మావ్, చూటేలూ కూర్చున్న జీపుకారులుపీపింగ్‌నగర వీధులలో మెల్లగా నడుస్తుంటే ప్రజల ఆనందానికి అంతులేదు. "మావ్ చూటేలు జిందాబాద్" అనే నినాదాలు ప్రతిధ్వనించాయి. తమ జీపులో మావ్ చూటేలు నిలబడి ప్రజల శాల్యూట్‌ను చిరునవ్వుతో అందుకున్నారు.

ఇంతటి మహోన్నతమైన ఆనందాన్ని పీపింగ్‌నగరం తన

దీర్ఘకాల చరిత్రలో యింతకు ముందెన్నడూ ఎరగదు.

ఆదే విధంగా చైనా రాజధాని నాంకింగ్ నగరం కమ్యూనిస్టు అరుణసేనలు ప్రవేశించిన ఏప్రిల్ 23వ తేదీకి కూడా చాల ప్రాముఖ్యత ఉంది.

చైనా ప్రజావిముక్తి సైన్యాలు నాంకింగ్ నగరం ప్రవేశించినవని తెలియగానే ప్రపంచ స్వాతంత్ర్య ప్రియులందరూ ముఖ్యంగా ఆసియా ప్రజలు పరమానంద భరితులయ్యారు. కమ్యూనిస్టు సేనలు నాంకింగ్ నగరంలో ప్రవేశించినవనే వార్త పారిస్‌లో జరుగుతున్న ప్రపంచ శాంతి మహాసభలో ప్రకటించగానే ప్రతినిధుల హర్షధ్వానులు మిన్ను ముట్టాయి. సభ మధ్యలో అయిదునిముషాల వరకు ఒకటే హర్షధ్వానులు.

కామ్రేడ్ మావో సియాంగ్ నాయకత్వాన చైనాప్రజలు సాధించుతున్న విజయాలకు ఎంతటి మహోత్తర ప్రాముఖ్యత ఉందో ప్రపంచ శాంతి మహాసభ ప్రతినిధుల హర్షధ్వానులు స్పష్టం చేస్తున్నాయి.

కామ్రేడ్ మావ్‌కు యివే మా మేడే విప్లవాభివందనాలు!

— సంపాదకవర్గం
'జనత'

* *

## సవరణ

3 వ పేజీ 3 వ పంక్తిలో 'మిగతా ప్రపంచంలో యింకా సామ్యవాదం పరిపాలిస్తోంది.' అనే దానికి బదులు 'మిగతా ప్రపంచంలో యింకా సామ్రాజ్యవాదం పరిపాలిస్తోంది' అని చదువుకోవాలి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M114 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| తెగిన పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| Scan | Ch. Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |